## కృతజ్ఞతలు...

పూలచెట్టుకు అంటుకట్టినట్టిగా చక్కగా ముందు మాట రాసిచ్చిన ఏకే ప్రభాకర్‌కి...

నా కళ్లముందు ఎదిగిన రచయిత మీద వస్తున్న బుక్కు ఇది.. నా మాటలు లేకుంటే ఎట్లా.. అని ప్రేమతో మూడు మాటలు రాసిచ్చిన ఎండి యాకూబ్ పాషాకి....

పుస్తకం ఎప్పుడూ సొంత డబ్బుల్తో వేసుకోకూడదని గొప్ప రహస్యం చెప్పి తనవంతు సహకారాన్ని అందించిన కూనపరాజు కుమార్‌కి..

షరీఫ్ గురించి నా కన్నా ఎక్కువ ఎవరికీ తెలీదని పుస్తకం చివర్లో పరిచయం రాసిన వేంపల్లె వాసి గౌతమ్ కుమార్‌కి..

# ఆకుపచ్చ సంతకం

## డా. ఎ.కె.ప్రభాకర్

అస్తిత్వవాద సాహిత్య సృజన ఊపందుకున్నాక స్వీయ జీవితానుభావాలను రికార్డు చేయడం దగ్గర ఆగిపోయిన రచయితల్ని చూస్తే జాలేస్తుంది. ఎవరి అస్తిత్వ వేదనలు వాళ్లవే - ఎవరి సమస్యలు వాళ్లవే - ఎవరి పోరాటాలు వాళ్లవే -ఎవరి కథలు వాళ్లే రాసుకోవాలి అన్న ఆలోచన పాదుకొన్నాక మాత్రమే సమాజంలోని భిన్న సముదాయాల బహుముఖీన జీవన పార్శ్వాలు, ఆయా సామాజిక వర్గాల్లోంచి ఎదిగొచ్చిన రచయితల వైవిధ్యభరితమైన భాషా, వ్యక్తీకరణ రీతులు సాహిత్యంలోకి ఎక్కి వచ్చిన మాట వాస్తవమే కానీ ఇన్ సైడర్స్ -అవుట్ సైడర్స్ అన్న విభజన యేర్పడ్డంతో కొత్త నష్టాలు కూడా సంభవించాయి. కేవలం స్వీయానుభావాల్ని అక్షరీకరించడంతో రచయితలకు పరిమితులు ఏర్పడ్డాయి. చాలామంది కుదించుకుపోయారు. తమ దృష్టిని విశాలం చేసుకోవడంలో విఫలమయ్యారు. ప్రతిభావంతుడైన రచయిత ఏదో ఒక స్థాయిలో సొంత అనుభవాల పరిధిని అధిగమించి బయటి అంశాల్ని సానుభూతితోనో, సహానుభూతితోనో ఇతి వృత్తాలుగా స్వీకరించవలసి ఉంటుంది. తనకు తెలిసిన జీవితాన్ని గురించి రాయడంలో వెసులుబాటు ఉంటుంది. రచనకు ప్రామాణికతని సాధించవచ్చు. అయినప్పటికీ రచయిత తన అనుభవాల పరిధిని విస్తరించుకోవాలి. తానెరుగని లోతుల్లోకి చూపుని ప్రసరింపజేయగలగాలి. అధ్యయనం ద్వారా, తమని తాము డికాస్ట్, డిక్లాస్ చేసుకోవడం ద్వారా తమది కాని ప్రపంచంలోకి చొచ్చుకు వెళ్లి ఉత్తమ రచనలు అందించిన వారెందరో ఉన్నారు.

ఆ కారణంగానే ఓబయ్య (వేలూరి శివరామ శాస్త్రి), కొత్త చెప్పులు (కరుణకుమార్), వేర్లు (కేతు విశ్వనాథరెడ్డి), ఎల్లి (అరుణ), రాగో (సాధన), ఆమె ఇల్లు (కవనశర్మ), పహెచాన్ (గీతాంజలి) వంటి ఎన్నో ఉత్తమ రచనలు మనకు

లభించాయి (ఈ లిస్టు కేవలం ఉదాహరణకు మాత్రమే).

స్వీయానుభావాల్ని సాహిత్యీకరించడంలో ఉన్న సాధకబాధకాల గురించి కూడా విస్తృతంగా చర్చ జరగాల్సే ఉంది. ఒడ్డున కూర్చున్న వాళ్లకి లోతు తెలీనప్పటికీ గజయీతగాళ్లు కూడా తమ సొంత సమాజం సంక్లిష్టతల లోతుల్లోకి వెళ్లి - మునుగీత వచ్చినప్పటికీ-వుక్కిరి బిక్కిరి అయిన సందర్భాలున్నాయి. అందుకు కారణాలు ఎన్నయినా చెప్పుకోవచ్చు. కానీ ప్రధాన కారణం - సరైన ప్రాపంచిక దృక్పథం లేకపోవడమే. ఒక దృక్పథం కలిగి ఉండటం, సైద్ధాంతిక నిబద్ధతకి అంకితం కావడం కూడా నేరమేనన్న భావన ఆధునికానంతర సాహిత్య ధోరణిగా చెలామణి అవుతోన్న నేపథ్యంలో దృక్పథ  రాహిత్యాన్ని సాహిత్య సృజనకు, రచయిత ఎదుగుదల ఆటంకంగా పేర్కొంటున్నందుకు ఎవరైనా తప్పుబట్టవచ్చు. కానీ తెలిసిన /తెలియని జీవితాన్ని అధ్యయనం చేయడానికి, అవగాహన చేసుకోవడానికి ప్రాపంచిక దృక్పథం తోడ్పడుతుంది. లేకుంటే చీకట్లో వెతుకులాటలా అగమ్యగోచరంగా ఉంటుంది. దృక్పథ రాహిత్యంతో కేవలం వాస్తవిక చిత్రణ వరకు ఆగిపోయిన రచయితలకీ యథాతథ వాదులకీ పెద్ద తేడా లేకపోవచ్చు. రచయితకుండే ప్రాపంచిక దృక్పథం అతని చూపుని విశాలం చేయాలి. రచనని తాత్విక స్థాయికి తీసుకుని వెళ్లగలగాలి. అది కళాత్మకంగా వ్యక్తం కావాలి. అంతిమంగా అది సమాజ పురోగతికి దోహదం చేయాలి.

పతంజలి 'పిలకతిరుగుడు పువ్వు' కథలో ఎస్.కోట మేజిస్ట్రేటు ఆలమండ దొమ్మికేసు పూర్వాపరాలు విచారణ చేశాక తీర్పునిస్తూ జీవితంలోకి తొంగి చూడకుండా వుండలేనట్టు - నేను కూడా వేంపల్లె షరీఫ్ 'జుమ్మా' కథలు చదివాక పై విషయాలు ముచ్చటించకుండా ఉండలేకపోయా.

ఎందుకంటే షరీఫ్ తన వైయుక్తిక అనుభవాలను యథాతథంగా కథగా మలచడు. వాటిని పురోగామి చైతన్యంతో గతితార్కికంగా విశ్లేషిస్తాడు. వాటికి సామాజిక వాస్తవికతని జోడించి సాధారణీకరిస్తాడు. అంతటితో ఆగిపోక పాఠకుడిలో ఉత్తమ సంస్కారాన్ని ప్రేరేపింపజేయడానికి కళాత్మకంగా తీర్చిదిద్దుతాడు. ఉదాత్తమైన మానవీయ విలువల్ని పెంపొందించడానికి అతను కథనొక సాధనంగా ఎన్నుకున్నాడు. చిన్న వయస్సులోనే షరీఫ్ ఇంత పరిణితిని సాధించడమే అబ్బురం. అతను తన జీవితాన్ని కథలకు వస్తువులుగా స్వీకరించాడు. తన సీమ నేల మీదే నిలబడి ఈ కథలన్నీ చెప్పాడు. తన ఇంటి భాషనే వాటిల్లో చెక్కాడు (ఒక్క 'చాపరాయి' మాత్రమే బయటి కథ - అందులో కూడా తానొక పాత్ర - అదీ ప్రకృతిని ప్రేమించే పాత్ర).

అందుకే షరీఫ్‌ని 'నేల విడిచి సాము చేయని' రచయితగా కేతు మాష్టారు గుర్తించారు.

అమ్మ - అక్క- నాయన- జేజి-తాను, తన పేదరికపు బాల్యం - చదువు- తన చుట్టుపక్కల మనుషులు - యీ పరిధిని దాటిపోనప్పటికీ యీ పాత్రలను అతను సార్వజనీనం చేశాడు. పసిపిల్లాడు చేతులకంటిన మట్టిని అందరికీ పూసినట్టు - యీ పాత్రలు మనందరి మనసుల్ని స్పృశించేలా చూశాడు. అతను కథలకు ముడి ఖనిజాన్ని ముస్లిం కమ్యూనిటీ నుంచే తవ్వి తీసినప్పటికీ దానికి సానబెట్టి మెరుగులు దిద్ది మానవీయ సంవేదనలు అద్దేటప్పటికీ అది కేవలం రాయలసీమ రత్నంగా మిగిలిపోక యీ నేలంతా కాంతులు చిమ్ముతోంది.

షరీఫ్ కథల్లో ఎక్కువ భాగం ఆత్మాశ్రయంగానే నడుస్తాయి. అయితే అతని ఆత్మే మన అందరిదీనూ. అతని బాల్యమే మనందరిదీనూ - అన్న భ్రమని కలిగిస్తాడు. అత్యంత నిరాడంబర కథనంతో తనతోపాటు మనల్ని తన ఊరికి, ఇంటికీ తీసుకుపోతాడు. అక్కడి మనుషుల్ని రక్తమాంసాలతో - మనో ధర్మాలతో పరిచయం చేస్తాడు. మనం ఆ కుటుంబంలో భాగమైపోతాం. ఆ జీవితాల్తో మమేకమైపోతాం. ఆత్మీయమైన శైలి ద్వారా, సాదా సీదా శిల్పం ద్వారా అతను ఈ అద్భుతాన్ని సాధించాడు.

షరీఫ్ కథలన్నింట్లో బలమైన జీవిత సంఘర్షణ ఉంది. ఆ ఘర్షణలో గెలుపోటములు ఉన్నాయి. ఆశ నిరాశలున్నాయి. కలలున్నాయి -కన్నీళ్లున్నాయి. దుర్భర దారిద్ర్యం ఉంది - అది పంచిన అంతులేని ఆవేదనలున్నాయి. వాటి నుంచి బయట పడాలనే పెనుగులాట ఉంది. వీటన్నింటినీ అధిగమించడానికి మనుషుల మధ్య మమతలున్నాయి - నిష్కల్మషమైన ప్రేమలున్నాయి. ఆచారాల్ని మించిన అనురాగాలున్నాయి. మతాన్ని మించిన మానవత్వం ఉంది.

షరీఫ్ కథల్లో ఎక్కడా సంక్లిష్టతకి చోటు లేదు. జీవితంలో ఉన్న సంక్లిష్టతని సైతం అతను తన కథల ద్వారా సరళం చేస్తాడు. అతని కథల్లో ఎక్కువ భాగం సింగిల్ పాయింటు మీదే నడుస్తాయి. వొక నిర్దిష్ట ప్రతిపాద్యాంశాన్ని ఆవిష్కరించడానికే ఉద్దేశించినవి. అయితే ఆ అంశాన్ని బలంగా చెప్పి తాత్త్విక స్థాయికి తీసుకెళ్లగల కళా నైపుణ్యం అతనిలో నిండుగా ఉంది. ఎంతో సాదాసీదాగా ఉండే సాధారణ వ్యక్తుల జీవితాల ద్వారానే అతను అసాధారణ జీవిత సత్యాల్ని అందజేస్తాడు. 'పర్దా' కథలో జేజి, 'జుమ్మా' కథలో అమ్మ, 'ఆకుపచ్చముగ్గు'లో అక్క, 'తెలుగోళ్ల దేవుడు'లో గౌసియా ఇందుకు ఉదాహరణలు. ఈ పాత్రలు ముస్లిం మతం లోపలా బయట కూడా ఎదుర్కొంటున్న అనేకరూపాల అణచివేతలకి తమ తమ స్థాయిల్లో నిరసన

తెలియజేస్తాయి.

మనిషి ముఖాలకు, ఇంటి గుమ్మాలకు పర్దాలు కట్టి గోషాపాటించే ఆచారం పనిపాట్లు చేసి పొట్టనింపుకునే పేద ముస్లింకి అక్కర లేదని, శ్రమ సౌందర్యానికి పర్దా అడ్డయి మనుషుల్ని 'పనికిరాని వాళ్లని' చేస్తుందనీ, పర్దా మనుషుల మధ్య దాపరికాల్ని సృష్టిస్తుందని కథలో జేజ ముఖమ్మీద కొట్టినట్టు చెప్పి కంటిచూపుకు అడ్డంగా కట్టిన సంప్రదాయం పర్దాని తొలగించింది. పర్దా వేసుకొని కొడుకు పంచన బతికే కన్నా 'నాలుగిళ్లు అడుక్కున్నా పర్వాలా' అని ధిక్కరించి గొప్పస్వేచ్ఛనీ, ఆత్మ విశ్వాసాన్ని ప్రకటించింది. పర్దా ఒక లేనిపోని భేషజం తప్ప కూటికీ గుడ్డకీ అక్కర వచ్చేది కాదని జేజ చేసిన యుద్ధ ప్రకటన ఆమె కొడుకుపైన కాదు - స్త్రీని అణచి ఉంచిన ముస్లిం పురుషాధిపత్య సమాజం మొత్తం పైన. నిజానికి అది వొక్క జేజిగొంతు మాత్రమే కాదు - పర్దాల చాటున మగ్గిపోతున్న కోట్లాది స్త్రీలది.

బురఖాకి వ్యతిరేకంగా బలమైన కవిత్వం ఇంతకుముందు వచ్చింది గానీ షరీఫ్ పర్దా కథలో జేజ ముఖత: వాడిన తార్కిక భాష ఎదుటి మనిషిని నోరు తెరవనివ్వదు. పర్దాని చించి పోగులు పెట్టాలనిపిస్తుంది. కానీ 'గుమ్మానికున్న పర్దాని సర్దిపట్టుకుని నీళ్లు నిండిన కళ్లతో నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయే' పరిస్థితే ఇంకా చాలా చోట్ల. అయితే -మనిషికి మనిషికి మధ్య పరదాలు కట్టి గోషా పాటించే బుర్రల్లో (అది యే మతమైనా) ఆలోచనల ప్రకంపనల్ని సృష్టించడమే రచయిత ఉద్దేశ్యం. అది నూటికి నూరు పాళ్లు సఫలమైంది.

'జుమ్మా' కథ మరింత ఉద్వేగభరితమైంది. 'ఎటువంటి కోరికలు లేకుండా, ప్రతి శుక్రవారం మసీదుకు పోయి, నమాజు చేసి, పక్కన బాంబు పేలినా అల్లా మీదే ధ్యాస పెట్టి ప్రార్థించాలని కొడుక్కి హితబోధ చేసే తల్లే - మక్కా మసీదులో బాంబు పేలిందని విని - 'ఆ మసీదు కల్లా పోకు నాయినా' అని దీనంగా బతిమాలుతుంది. ఈ దేశంలో సగటు మనిషిని ఇంత అభద్రతకు, దయనీయమైన పరిస్థితికి నెట్టివేసిన పరిస్థితుల మీద వెగటు పుట్టించేలా షరీఫ్ రాసిన యీ కథ గుండెను కలచివేస్తుంది. కథలో తల్లీ కొడుకుల దు:ఖం వారిద్దరిది మాత్రమే కాదు మనసున్న ప్రతి పౌరుడిది. మమతున్న ప్రతి వ్యక్తిదీ. 'కన్న పేగు ముందు దేవుడు చేదయ్యాడన్న వాస్తవం వొక కోణం అయితే - బాంబుల సంస్కృతిని ప్రధాన కార్యచరణగా మార్చుకున్న మతోన్మాదం మానవీయతకు పెనుసవాలుగా పరిణమించిన వైనం క్రోధాన్ని కలిగిస్తుంది. షరీఫ్ ఎంతో సంయమనంతో రాసిన ఈ కథ సాధించదల్చుకున్న ప్రయోజనం కూడా అదే. రక్తసిక్తమైన చరిత్ర పుట్టల్లోంచి

వినిపించే తల్లి గోసని అర్థం చేసుకుంటే - ఎక్కడ వొక తుపాకీ తూటా పేలినా, బాంబు బద్దలైనా గాయం అయ్యేది తల్లి గుండెకే అని అమ్మ కడుపున పుట్టిన ప్రతి ఒక్కరూ అనుకుంటే - మతం పేరున జరిగే పవిత్రయుద్ధాలు, క్రూసైడులూ, భజరంగ బలులూ ఉండవు కదా- అని కథ చదివాక అనుకోకుండా ఉండలేం.

వేంపల్లె గల్లీల తల్లి వొడి నుంచి ఎదిగి చార్మినార్ బురుజుల్ని ఎక్కిలోకం చూస్తున్న షరీఫ్ ఇన్ సైడర్‌గా మతాచారాల్లోని డొల్లతనాన్ని- అవుట్ సైడర్‌గా స్త్రీ హృదయాంతరాళాల్లోని కల్లోలాన్నీ, మతాల మధ్య నిలువునా గీసిన గీత మీద మనిషిగా నిలబడి మతపరమైన సాంస్కృతిక వైరుధ్యాల్లోని అసమంజసతనీ ఏకకాలంలో ఆవిష్కరించిన కథ - ఆకుపచ్చ ముగ్గు.

ముస్లిం కుటుంబంలో వాకిట ముగ్గులేయడం తప్పు. కానీ జీనత్ చదివేది తెలుగు బడిలో. ఉండేది హిందువుల ఇళ్ల మధ్య. ఆంక్షలు, నిషేధాల మధ్య ఇసుకలో, నీళ్లలో, గాల్లో ముగ్గులు చెక్కే జీనత్ చివరికి ఆచారానికి తలవొగ్గి వాకిట్లో వేసే ముగ్గు డిజైన్లని అరచేతిలోకి గోరింటాకు డిజైన్లలోకి 'తర్జుమా' చేసుకుని కళాతృష్ణ ని తీర్చుకుంది.

'ముగ్గు ఇంటి ముందు వేస్తే తప్పు కానీ చేతిలో వేస్తే కాదు కదా..! ఒక మతానికి మరో మతానికి మధ్య తేడా ఇంతేనా? ఇంత మాత్రం దానికేనా.. ఇన్ని మత ఘర్షణలు జరుగుతుంటాయి?'

అని అమాయకంగా ప్రశ్నించిన జీనత్‌లో గొప్ప తత్త్వవేత్తని చూస్తాం. మత వైరుధ్యాన్ని ఎంత తేలికగా పరిష్కరించాడు షరీఫ్! అతనిలో ఈ తార్కికత ఎక్కడ నుంచి వచ్చింది - ఈ తర్కాన్ని కథగా మలిచే కళా వైదగ్ధ్యం ఎలా అలవడింది - సాంస్కృతిక ఆదాన ప్రదానాలకు సంబంధించిన ఎంతో సంక్లిష్టమైన అంశాన్ని యింత సరళంగా సూటిగా తేల్చి చెప్పే చాతుర్యం ఎక్కడ అబ్బింది - ఇలా ఆశ్చర్యంతో కూడిన ప్రశ్నలు మనకు కలిగినప్పటికీ వాటన్నిటినీ మించి -' నిజమే.. ఇన్ని కొట్లాటలు.. ఇంత హింస.. ఇంత ఉన్మాదం.. యిన్ని యుద్ధాలు అవసరమా?' అన్న ప్రధానమైన ప్రశ్న మనసులో నాటుకుంటుంది. ఎన్ని ఆంక్షలు విధించినా కళ దాని వ్యక్తీకరణకు దారులు వెతుక్కుంటుంది- అన్న మరొక పొర కూడా ఈ కథలో దాగి ఉంది. కళ మీద, కళాకారుడి మీద నిషేధాలు విధించి మాతృదేశానికి దూరం చేసిన మత మౌఢ్యంపట్ల, మతాల మధ్య లేని వైరుధ్యాలు సృష్టించి - చిచ్చు రగిల్చి ఆ మంటలో చలి కాచుకునే దుర్మార్గం పట్ల సిగ్గుపడేలా చేస్తుంది. ఆకాశమంత రాజకీయ - సాంస్కృతిక తాత్త్వికతని అరచేతిలోకి ఆకుపచ్చముగ్గుగా వొంపిన షరీఫ్

నేర్పు చూసి ముచ్చట పడకుండా ఉండలేం.

'విష్ణుభక్తులెల్ల వెలిబూది పాలైరి
వాదమేల మత విభేదమేల?
తెలియలింగధరులు తిరుమంటిపాలైరి
విశ్వదాభిరామ వినురవేమ!'

దైనందిన ఆచార వ్యవహారాల నుంచి, విధి నిషేధాల నుంచి, వైషమ్యాలను పెంచి పోషించే కుహనా మత సంస్కారాల నుంచి వొక తర్కాన్ని సాధించి దాన్ని తాత్త్విక స్థాయికి తీసుకెళ్లి జీవన సత్యాన్ని నిర్వచనంగా ఆవిష్కరించిన వేమన తిరుగాడిన నేల మీద కలంపట్టిన షరీఫ్ ఆ వారసత్వాన్ని అందిపుచ్చుకుని కొనసాగిస్తున్నాడనిపించింది.

షరీఫ్ కథల్లో ఎక్కువ భాగం ఏకాంశ ప్రతిపాదనోద్దిష్టాలని ఇంతకుముందు చెప్పుకున్నాం కానీ 'ఆకుపచ్చముగ్గు' అందుకు భిన్నంగా బహుముఖీనంగా సాగుతుంది. పెళ్లికి ముందు -'లావు లావు బుగ్గలు -చలాకీ కళ్లు - అప్పుడే చెట్టునుంచి కోసుకొచ్చిన బత్తాయి పండులా' ఉండే జీనత్ పెళ్లయి ముగ్గురాడపిల్లల తల్లయి 'వాళ్లు ఎదిగొస్తుంటే తాను భయంలోకి ఒదిగిపోతూ కాలం గడుపుతూ' ముఖమంతా పీక్కుపోయి, కళ్లన్నీ కళ తప్పి డీలా పడిపోవడానికి కారణాలేంటని స్త్రీ దృక్కోణం నుంచి ఆలోచింపజేసే మరో పొర, దాంతో పాటు ఆ కుటుంబంలోని వ్యక్తుల మధ్య సున్నితంగా అల్లుకున్న ఆత్మీయ సంబంధాలు మన మెదడుకు, మనసుకు పనిచెబుతాయి.

'తెలుగోళ్ల దేవుడు' కథ కూడా అలాగే ఆలోచింపజేస్తుంది. 'అన్ని మతాల వాళ్లు కలసి చదువుకునే స్కూళ్లకు దేవుళ్ల పేర్లు, మతాన్ని తెలిపే పేర్లు కాకుండా పువ్వుల పేర్లు, చెట్ల పేర్లు, ప్రకృతి పేర్లు పెట్టి వాళ్లిచ్చే బెల్టుల్లో, స్కూలుడ్రెస్సుల్లో, బహుమతుల్లో అచ్చెయ్యొచ్చు కదా'అన్న గౌసియా ఆవేశంతో కూడిన ఆవేదన వినేదెవరు? చిన్నారుల ప్రతిభను గుర్తించి ఇచ్చిన బహుమతుల్ని బడియంతో బీరువాల్లో దాచిపెట్టుకునే పరిస్థితి కల్పించే విద్యావ్యవస్థలోకి సెక్యులర్ భావన ప్రవేశపెట్టాల్సిన కర్తవ్యాన్ని బోధించిన కథ ఇది. అయితే మార్పు -గౌసియా, చాన్ బాషా, రామిరెడ్డి లాంటి వ్యక్తులు మాత్రమే పూనుకుంటే రాదు- అదొక సామూహిక చైతన్యంతోనే సాధ్యమవుతుందన్న సూచనతో ఈ కథ ముగుస్తుంది.

'చదువుకి లేని మతం ఆ చదువు చెప్పే స్కూళ్లకెందుకుండాలి?'- అన్నది

గౌసియా ప్రశ్న. నిజానికి మన చదువులు కూడా మతం గబ్బు కొడ్తూనే ఉన్నాయి. నా బోటివాడు తరగతి గదుల్లో బోధించే పాఠ్య పుస్తకాలు అశాస్త్రీయాంశాల్తో నిండి మోరీల్లా ఉన్నాయి. పాఠశాలల్లో చిన్నారులు వేసే ప్రతి అడుగులోనూ ఏదో వొక రూపంతో మతం జడలు విచ్చుకుని నడయాడుతూనే ఉంది. కొన్ని కాన్వెంట్లు -ప్రత్యేక శిశు మందిరాలైతే పేరు - ఊరు - అడ్రస్ - పాఠం - పాట అంతా మత విష మందిరాలుగా పాతుకుపోయాయి. కొన్ని సందర్భాల్లో, స్వయం ప్రతిపత్తితో విర్ర వీగుతున్నాయి. శాస్త్రీయ దృష్టితో కూడిన ప్రత్యామ్నాయ పాఠ్య ప్రణాళికల్ని తయారు చేసుకోవడంలో కానీ, లౌకిక ప్రజాస్వామిక విద్యా వ్యవస్థని ఏర్పరచుకోవడంలో కానీ ప్రగతి శీల ఉద్యమాలు విఫలమయ్యాయన్న విషాదం గుండెనుకోస్తుంది.

అందుకే - కలలో గానీ పావలా డబ్బులిచ్చి పండక్కి కూడా పలక కొనుక్కోలేని పసివాళ్ల దైన్యం (పలక పండగ), వేసవి సెలవులకి విహార యాత్రల సంగతేమో కానీ అమ్మమ్మ ఇంటికి వెళ్లి సరదాగా గడపలేని పేదల నిస్సహాయత (దస్తగిరి చెట్టు), దీపం బుడ్డిలోకి కిరోసిన్ కొనుక్కోలేక 'చదువుకోవడమంటే భయమేసే' విద్యార్థుల బాల్యం (అయ్యవారి చదువు) - ఇటువంటి యధార్థ వ్యధార్త గాధలు ఇంకా మనల్ని నిత్యం కలవరపరుస్తూనే ఉన్నాయి. ఈ దుస్థితులన్నీ షరీప్ బాల్యంలోని చదువుల పర్వంలో వివిధ అధ్యాయాలే. సోషలిస్ట్, సెక్యూలర్ పునాదుల మీద నిర్మించామని చెప్పుకునే ఈ దేశంలో పేదరికం, మతం చదువుకు ఎంత విఘాతంగా తయారయ్యేయో తెలియజెప్పడానికే షరీఫ్ వాటికి కథారూపం కల్పించాడు.

కథ రచనలో రచయిత పాటించాల్సిన తాటస్థ్యం గురించి, పొందాల్సిన తాదాత్మ్యం గురించి తెలుసుకోవడానికి ఈ కథలు ఎంతగానో తోడ్పడుతాయి. స్వీయ జీవితానుభావాలకే కథారూపం కల్పిస్తున్నప్పటికీ -షరీఫ్ ఎత్తి చూపిన అంశాలు కేవలం వైయుక్తికమైనవికావు। మొత్తం వ్యవస్థకంతటికీ సంబంధించినవి. వైయుక్తికతని సాధారణీకరించడంలో షరీఫ్ పాటించిన సంయమనం వల్ల అతని కంఠస్వరం ఎక్కడా దారి తప్పలేదు - కళాత్మక విలువల్ని మర్చిపోలేదు. తనది కాని జీవితాన్ని విశ్లేషించి కథలుగా మల్చగల నేర్పు షరీఫ్‌లో నిండుగా వుందనీ - ఆ దిశగా ముందు ముందు అతను దృష్టిపెట్టాలని ఈ కథలు చదివాక ఆశించకుండా ఉండలేం.

నిజానికి షరీఫ్ తొలి దశలో తన చుట్టూ ఉన్న జీవితాల్నే -తనను కల్లోల పరచిన సంఘటనల్నే తన కథలకు వస్తువులుగా స్వీకరించాడు. సీమ కడపలో పుట్టిన వర్ధమాన కథకుడిగా అతనికి గుర్తింపు తెచ్చిన 'జీపొచ్చింది' కథ (2003) కరువు సీమలో కరెంటు బాధితుడైన రైతు జీవితమే.

ప్రకృతి, ప్రభుత్వాలు కలసి కక్ష గట్టి సీమ రైతు జీవితంతో ఎలా చెలగాట మాడుతున్నాయో కళ్లకు కట్టినట్టు చిత్రించిన ఈ కథలో వెంకట్రెడ్డి మూడెకరాల శెనిక్కాయ చెట్ల ప్రాణం నిలపడానికి పడిన పాట్లు ఇంతకుముందు సీమ రచయితలు చెప్పినవే. ఒక విధంగా చూస్తే సీమ రైతుల సేద్యం చరిత్ర అంతా ఒకటే. కష్టాలు, కన్నీళ్లు, నష్టాలు, అప్పులు. దీన్ని ఎవరు రాస్తున్నారు - ఎవరు మారుస్తారు అన్నదే ప్రశ్న.

చుక్కలు చూసి చెమ్మకోసం బోరేసి, పూటకిన్ని పాలిస్తూ కుటుంబాన్ని రోడ్డున పడకుండా కాపాడుకొస్తున్న ఎనుమును తెగనమ్మి కరెంటు మోటరు పెట్టుకుంటే బిల్లు కట్టలేదని మీటర్ స్టార్టర్ని వెంకట్రెడ్డి ప్రాణాల్తో సహా కరెంటోళ్లు పీక్కుపోయిన చరిత్రనైతే హృదయవిదారకంగా వర్ణించాడు షరీఫ్. కథ ఎత్తుగడ-ముగింపు, కథనం - నిర్వహణ, అందులో వాడిన భాషా అన్నింటిలో చేయి తిరిగిన రచయిత మాత్రమే సాధించగల మెలకువ కనిపిస్తుంది. దీంతో షరీఫ్‌కి 'జీపొచ్చింది షరీఫ్'గా పేరొచ్చింది.

దాదాపు అదే కాలంలో రాసిన 'రజాక్ మియా సేద్యం' కూడా రైతు జీవితమే. అయితే ఈ రైతు తిండికి నూకల్ని కూడా కాపోళ్ల వద్ద దీనంగా అప్పుతెచ్చుకునే నిరుపేద ముస్లిం. ఏ దుబాయికో, కోయిటుకో పోయి నౌకరినో చాకిరీనో చేసుకుని బతకాల్సిన సాయిబు- నాయన నుంచి సంక్రమించిన భూమిని నమ్ముకుంటాడు. కానీ దానికి నీళ్లకోసం ఏ రెడ్డినో ఆశ్రయించాల్సిందే.

'ఉద్ధతుల మధ్య పేదలకుండతరమా?' అన్న పద్యపాదం పుట్టిన సీమలో ఇద్దరు రెడ్ల - పెద్ద వ్యవసాయాల మధ్య పేద రజాక్‌మియా సేద్యం సాగుతుందా! దాదాహయాత్ చెప్పినట్టు -తెలుగు కథను గొప్పగా ప్రభావితం చేసిన రెండు జీవధారలు (సీమ -మైనార్టీ) యీ కథలో సంగమించాయి. (ఈరెండు కథల్ని షరీఫ్ విషాదాంతాలుగా మలిచాడు. 'రజాక్ మియా సేద్యం'లో అతని భార్యని చంపే ముగింపు అవసరం లేదేమో అని నాకనిపించింది. విషాదం గుండెను బలంగా తాకి నాలుగు కాలాలు గుర్తుంటుందని రచయిత భావించి ఉండవచ్చు. ఆ ముగింపు అనుభూతి ఐక్యతని కూడా దెబ్బతీసింది)

'రజాక్ మియా' కథలో కథనం కోసం కూడా షరీఫ్ అచ్చమైన కడప భాషనే వాడాడు. అది కథకు అపురూపమైన నిసర్గమైన అందాన్నిచ్చింది. 'తీగ సాగిపూలు పూచినట్టు అతని కథలు ఇప్పుడు గుబాళిస్తున్నాయి' -అని సౌభాగ్య ముచ్చటపడటానికి యీ భాష కూడా వొక కారణమేమో! అయితే షరీఫ్‌ని రాయలసీమకో, మైనార్టీకో పరిమితం చేయడానికి సౌభాగ్య ఇష్టపడడు.

ఇన్నాళ్లూ కవిత్వానికి వ్యాఖ్యాతగా వ్యవహరిస్తోన్న సౌభాగ్యని మొదటిసారిగా కథలపై విస్తృత వ్యాఖ్యానానికి పురిగొల్పిన ఘనత షరీఫ్‌ది. షరీఫ్ కథలని గుండె లోతుల్లోంచి ప్రేమించాడు సౌభాగ్య. కథల్లోని నిరాడంబర శైలి, శిల్ప సౌకుమార్యం, భాషా సౌందర్యాలతోపాటు, కథల్లో ప్రధానంగా ప్రత్యక్షరంలోనూ పరుచుకుని ఉన్న కాలుష్యమంటని కరుణ, పదేపదే పల్లవించే మానవత్వం, మనుషుల మధ్య పెనవేసుకున్న మమతానురాగాలు, వాటిని వ్యక్తం చేయడానికి పలికిన దయార్ద్ర స్వరం సౌభాగ్యని కదిలించి ఉంటాయి. అంతేకాదు ప్రకృతిని ప్రేమించే షరీఫ్ ముగ్ధ స్వభావం, స్వీయానుభవాల్ని విశ్లేషించుకునే చురుకుదనం, చైతన్యం, అతనిలోని పసితనపు పరిమళం, మానవానుభూతుల్ని మణిదీపాల్లా వెలిగిస్తున్న అతని ప్రేమభరితమైన మందహాసం, దృశ్యానికి -దు:ఖానికి అందని జీవిత సత్యాల్ని కథగా ఆవిష్కరించే ప్రతిభ, సామాజిక సరిహద్దులు దాటిన సౌందర్యం, పర్వత శిఖరం ఎక్కి కాంతిని చుంబించడానికి అతను చేసే సాహసప్రయాణం, చిర్నవ్వు దీపాన్ని చిరంతనంగా వెలిగించుకుని కాపాడుకునే సంయమనం, ఎంతటి కష్టాన్నయినా ఒంటరిగా ఎదుర్కోవాలన్న ఆత్మస్థయిర్యం - ఇంకా మరెన్నో సౌభాగ్యని కట్టిపడేశాయి. షరీఫ్ కథలు చదవని వాళ్లు ముందుగా సౌభాగ్య రాతలు చూస్తే - షరీఫ్ కోసం హైదరాబాద్ గల్లీలన్నీ తిరిగి ఏ పత్రికాఫీసులోనో అతణ్ని గాలించి పట్టుకుని గుండెకు హత్తుకోబుద్ధవుతుంది. ఆ తర్వాత కడప నవాబు సాబుల గరీబు వెతలు అతని నోట వినాల్సిందే.

అయితే ఆలమండ కేసు విచారించిన మెజిస్ట్రేటులాగా, నాలాగా సౌభాగ్య కూడా ఇతరేతర విషయాలు మాట్లాడతాడు. ఎందుకో తెలీదు - అతనికి దేశాల్ని, - ప్రజల్ని ఉద్ధరించే సిద్ధాంతాలంటే గిట్టదు. పైగా అవి మట్టి కొట్టుకుపోయాయని సంతోషం. అకారణంగా ఆ క్రోధానందాల్ని కక్కేస్తుంటాడు. అదే విధంగా మాండలిక భాషా రచనల పట్ల కూడా సౌభాగ్యకు నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. వాటిని కూడా షరీఫ్ కథా వ్యాఖ్యాన సందర్భంలో నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. షరీఫ్‌పై సౌభాగ్యని చదివాక ఈ రెండు మాటలు దాచిపెట్టుకుని ఉండలేకపోయా. ఎవరికైనా అభిప్రాయాలుండటం తప్పు కాదు - వాటిని దాచుకోవడమే తప్పు. వ్యక్తీకరించే స్వేచ్ఛ లేకపోవడం అప్రజాస్వామికం.

మతాల్లేని, మతాల్లో పర్దాల్లేని, దారిద్ర్య పరివేదనల్లేని, ఆకల్లేని, అసమానతల్లేని వొక కలని ఆకుపచ్చముగ్గుగా పాఠకుల అరచేతుల్లో అద్దుతున్నాడు షరీఫ్. అతని కథల్లో గొప్ప ఆర్తి ఉంది. అది మనలో డైరెక్టుగా ప్రవహిస్తుంది. అలా

ప్రవహింపజేసే అద్భుతమైన రచనా కౌశలం షరీఫ్‌లో మెండుగా ఉందని అతని ప్రతి కథా నిరూపిస్తోంది.

తెలుగు కథ పుటల్లో ఇప్పుడు షరీఫ్ చేస్తున్న ఆకుపచ్చ సంతకం లయగా ప్రాణం పోసుకుంటోంది. అది బాగా 'పండి' ఎర్రెర్రగా మెరుస్తుందని ఆశంస.

హైదరాబాద్, 14 ఏప్రిల్ 2012
(బాబా సాహెబ్ పుట్టినరోజు)

# బహుముఖ అస్తిత్వ ప్రకటన

## యం.డి. యాకూబ్ పాషా

ఎండాకాలానికి, చలికాలానికి మధ్య ఒక అర్ధరాత్రి.

పడుకునే ముందు ఒకసారి బుక్‌షెల్ఫ్ వైపు చూశాను. నూట నాలుగు పేజీల షరీఫ్ తన కళ్లద్దాలను సవరించుకుంటూ నవ్వు తున్నాడు. నిజానికైతే గుడ్‌నైట్ చెప్పి పడుకోవాలి. నేను అలా చేయలేదు. షరీఫ్‌ను నా దగ్గర కూర్చోమన్నట్టు సైగ చేశాను. అతను బుక్‌షెల్ఫ్‌లో నుంచి వచ్చి బుద్ధిగా కూర్చున్నాడు. ఇంచుమించు తొమ్మిది సంవత్సరాల వెనక్కి ఆ పిల్లాడిని తీసుకెళ్లాను. పంజాగుట్ట స్మశానం దగ్గర ఉన్న ఆంధ్రజ్యోతి పాత బిల్డింగ్ దగ్గరకు తీసుకెళ్లాను.

"ఇప్పుడు చెప్పు షరీఫ్..అప్పట్లో ఇక్కడ రాసిన కథ" అన్నాను.

అతను కడప యాసలో నవ్వాడు. "తొమ్మిది సంవత్సరాలవుతోంది.. ఇంకా మరిచిపోలేదా?" అన్నాడు.

"ఎలా మరిచిపోతాను. కదీర్ సాబ్ నీ కథ పట్టుకుని హైదరాబాదంతా తిరిగి అక్కడి నుంచి ఔరంగాబాద్‌కు పోయి ఆడి నుంచి బొంబై పోయి హుసేన్‌తో బొమ్మ వేయించుదామని ట్రై చేసినాడు కదా.." అన్నాను.

"ఆయన కాదు ఈయన ఏసినాడు" అని బొమ్మేసినాయన గురించి చెప్ప బోయినాడు.

నేను మధ్యలోనే అడ్డుకుని "అదంతా ఇప్పుడెందుకు కానీ.. నీ కథ ఉందే.. అదే 'జీపొచ్చింది' గురించి చెప్పు?" అన్నాను. అతను చెప్పడం మొదలుపెట్టాడు.

"తెలుసు కదా.. ఇతనే వెంకట్రెడ్డి.."అని రైతును పరిచయం చేశాడు.

రైతు బలహీనంగా ఉన్నాడు. కన్నీళ్లకు మానవరూపం మాదిరిగా ఉన్నాడు.

"ఏమైంది ఇతనికి..?" అని అడిగాను.

అతడు పొలం దగ్గరకు తీసుకెళ్లి కరెంటు బోరు వైపు చూపిస్తూ బోరు బోరునా

ఏడ్చాడు. "ఇంతకీ అక్కడ బోరు ఏది?" అని అడిగితే కరెంటోళ్ల కర్కోటకత్వాలను గురించి చెప్పాడు.

000

వెంకట్రెడ్డి పొలం వాన పడితే గానీ పచ్చగా నవ్వదు. 'రాయలసీమలో వానంటే మాటలా? వానను నమ్ముకుని చేసేది ఎవుసాయమేనా?'- అందుకే అప్పు చేసైనా తన పొలాన్ని పూలవనం చేయాలనుకుంటాడు వెంకట్రెడ్డి.

'నాకెందుకో మన పొలంలో నీళ్లు పడ్తాయి. మన కష్టాలు తీర్తాయి అనిపిస్తాంది మావా' అని భార్య కూడా అతనికి ధైర్యం చెప్పింది.

'నీళ్లు పడితే పొలం నాది. పడకపోతే అప్పిచ్చిన ఆసామిది' అనుకుంటూ భార్య ధైర్యానికి తోడు తన ధైర్యాన్ని కూడా చేర్చుకుని రంగంలోకి దిగాడు వెంకట్రెడ్డి.

అయ్యో! మూడు వందల అడుగులు దాటినా బోరు రాడ్డు చెమ్మకు తగల్లేదు!! బోరు నుంచి ఒక చుక్క కూడా నీరు రావడం లేదు. ఆలుమగల కళ్ల నుంచి మాత్రం వద్దన్నా ఆగకుండా ప్రవహించే వేడి వేడి కన్నీటి ప్రవాహం.

ఆ ప్రవాహం మూడు వందల అడుగులు దాటిన తర్వాత ఆగింది. గంగమ్మ కన్ను.. కరుణ చూపింది. తెల్లటి గంగ పరుగు పరుగునా వచ్చింది. ఆ గంగమ్మ నీడలో ఆ రైతు కుటుంబం పచ్చగా బతికిందా అంటే లేదు. ఎన్ని కష్టాలు పడుతూ బతికిందో షరీఫ్ చెప్పాడు.

గుండె కన్నీటి సునామీలో కొట్టుకుపోయే వాక్యాన్ని కథ చివర్లో ఇలా చెబుతాడు..."జీపు ముందుకు కదిలింది. దుమ్ము లేపుకుంటూ వెళ్తున్న ఆ జీపు వెంకట్రెడ్డి ప్రాణాన్ని తీసుకెళ్తున్న యముని వాహనంలా ఉంది"

ఆ మాటతో మనం వెనక్కి వెళ్లిపోతాం. మనం మన అనుభవాల్లోకి.. వాటిల్లో వినిపించే ఆకలి కేకల దగ్గరికి చేరుకుంటాం.

కొన్ని రోజుల క్రితం నేను మా ఊరు వెళ్లినప్పుడు ఫ్రెండ్‌తో అన్నాను " మనం చిన్నప్పుడు పొలాలు అ...క్కడి దాక ఉండేవి.. ఏవిరా పొలాలు? అన్నీ ఇండ్లే కనిపిస్తున్నాయి?"

వాడు అన్నాడు -" ఇయ్యాల రేపు ఎవడయ్యా ఎవుసాయం చేసేది?"

"ఎందుకు? ఏమైంది?"- అన్న ప్రశ్నకు ఒక పంట పండటానికి ఎంత ఖర్చవుతుందో, ఎన్ని కష్టాలు ఉంటాయో పూసగుచ్చినట్టు చెప్పాడు.

తర్వాత ఇలా అడిగాడు..." ఇప్పుడు చెప్పు నీకే గనుక భూమి ఉంటే

ఎవుసాయం చేస్తావా?"

నేను చేస్తానన్నానా? చేయనన్నానా? అనేది విషయం కాదు కానీ ఆర్థిక పరిపుష్టి లేని రైతు, అదృష్టం లేని రైతు - వ్యవసాయం చేయడం దండగ అనే స్నేహితుని మాటలను ఖండించడానికి మనలో ఉన్న ఎంత కరుడు కట్టిన భావుకత అయినా, వ్యవసాయ ప్రేమికత అయినా ముందుకు రాదు. వాస్తవం అలాంటిది.

ఒకప్పటి పంట పొలాలు చూడండి. దాబాలై కనిపిస్తాయి. ఒకప్పటి పంట పొలాలను వెదకండి. నల్లని మెకానిక్ షెడ్డులై కనిపిస్తాయి. ఒకప్పటి పంట పొలాలను ఆత్మీయంగా పిలవండి. రియల్ ఎస్టేట్ నాగుపాములు వాస్తవ లోకంలోకి తీసుకువస్తాయి. భవిష్యత్‌లో వెంకట్రెడ్డి ఏమై పోతాడు?

మళ్లీ అప్పు చేస్తాడా? కరెంటు స్తంభానికి శవమై తేలుతాడా? పెరుగన్నంలో ఎండ్రిన్ కలుపుకుని తింటాడా? ఏమై పోతాడు వెంకట్రెడ్డి? వెంకట్రెడ్డి ముఖం ముఖం కాదు. భారత గ్రామీణ వ్యవసాయ ముఖచిత్రం. ఒక సాయినాథ్‌లా రైతు పేద గుండెను మనకు చూపెట్టాడు షరీఫ్.

వెంకట్రెడ్డి విషాదలోకంలో కన్నీళ్లు తుడుచుకుంటూ ఉండగానే నూకలమూటె కోసం కళ్లల్లో ప్రాణాలు పెట్టుకుని ఆశగా చూస్తున్న రజాక్‌మియా గురించి అతని సేద్యం గురించి చెప్పడం ప్రారంభించాడు షరీఫ్.

చలమాడ్డి నాలుక సాగుతుంది.. సాగుతూనే ఉంది. రజాక్ మియా పొలాన్ని మింగడానికి వలపై నూకలమూటె ఉన్నది. వల మీదికి పోకపోతే నూకల మూటె దొరకదు. పోతే ప్రాణం తిరిగిరాదు.

"రెండు రోజులు. రెండే రెండ్రోజులు. నీ మోటరు నీళ్లు ఇచ్చినావంటే ఇప్పుడే ఎల్లి నీ తోట్లో నుంచి కాలువ తొక్కుంట. నా సెనిక్కాయ సెట్లను బతికించుకుంటా. ఇయ్యి చేతులు కాదు రెడ్డి. కాదొనొద్దు.."

రెడ్డి అవుననలేదు.. కాదనలేదు. నాలిక మాత్రం మరింత పెద్దగా చాచాడు. దానికి దొరక్కుండా రజాక్‌మియా పరిగెడుతూనే ఉన్నాడు. పరిగెడుతూనే ఉన్నాడు. ఆయాసం వస్తుంది. కాస్త ఆగాడు.

"నందిమండలంకాడ యాక్సిడెంట్ అయిందట. సాయిబూలాయమ ఎవరో ట్యాక్సీ నుంచి కింద పడిపోయిందట. నెత్తంతా ఒక పక్క చీలిపోయింది. చూల్లేకున్నాం సామి" ఎవరి మాటలో ప్రమాదం రొద పెడుతున్నట్టుగా రజాక్‌మియా దగ్గరికి చేరాయి.

"ఆమె ఎవరై ఉంటారు?"అనుకున్నాడు తనలో తాను.

ఇంటికొచ్చి "అమ్మ ఎక్కడ?" అని కొడుకును అడిగితే అతను.."నంది మండలానికి పనికిబోయిందబ్బా.."అంటాడు.

రజాక్ మియాతో పాటు వింటున్న మన గుండెల్లో కూడా పెద్ద రాయి పడింది. ఏకధాటిగా రెడు కథలు చెప్పి ఊపిరి పీల్చుకోవడానికి రెండు నిమిషాలు ఆగాడు షరీఫ్. ఆ తరువాత అతన్ని ఇలా అడిగాను. "నాకెందుకో.. జీపొచ్చింది కథలో వెంకట్రెడ్డి వెంకట్రెడ్డి కాదనిపిస్తోంది. అతను కూడా మరో రజాక్ మియే అనిపిస్తోంది."

"అవును. అతను వెంకట్రెడ్డి కాదు. రజాక్ మియానే. కొన్ని కారణాల వలన పాత్ర మతం మార్చాల్సి వచ్చింది" అన్నాడు.

అప్పుడునాకు అనిపించింది. జీపొచ్చింది, రజాక్ మియా కథలను ఒకటి చేసి ఆ కథకు మరికొన్ని కథలు కలిపితే కృత్రిమత్వం లేని ఒక గొప్ప నవల తయారై పోతుంది. తెలుగు సాహిత్య వాతావరణంలోఅస్తిత్వ వాదాలు బలంగా ప్రతిఫలిస్తున్న ఆ కాలంలో కాస్త బలహీనంగానైనా అవి కనిపిస్తున్న నేటి కాలంలో తెలుగు ముస్లిం సమాజానికి సంబంధించిన అనేక కోణాల్లో నుంచి అనేక కథలు, చాలా తక్కువ నవలలు వచ్చాయి. నాకు తెలిసి ఈ సాహిత్యంలో రైతు జీవితం ఎక్కడా కనిపించలేదు. బహుశా రచయితల నేపథ్యం వ్యవసాయానికి దూరంగా ఉండటమే కావొచ్చు.

ఇలాంటి సమయంలో శైలి పాతదే అయినా తనదైన ప్రత్యేక వస్తువుతో ముందుకు వచ్చాడు షరీఫ్.

"సాయిబూలు కూడా వ్యవసాయం చేస్తారా? అని ఇప్పటికీ ఆశ్చర్యపోయే సమాజంలో "అవును వాళ్లు కూడా వ్యవసాయం చేస్తారు" అని చెప్పే కథ ఒకటి కావాలి. ముసల్మాను రైతుల కష్టాలను కథలుగా రాసే రచయిత ఒకరు కావాలి.. అని అనుకున్నప్పుడు షరీఫ్ తప్పనిసరిగా గుర్తుకు వస్తాడు. వ్యక్తికి ఉన్నట్టు వృత్తికి కులం ఉంది. అందుకే సాయెబూల రైతు కష్టం కష్టం కాకుండా పోయింది. వ్యవసాయం అనేది ఏ దారి లేక ఇరుక్కుపోయిన మార్గమై పోయింది.

'రజాక్ మియాసేద్యం'లో గొల్లోళ్ల పిల్లోడు అంజిగాడు ఇలా అంటాడు.. "సాయిబూలు మీకెందుకు మామా వ్యవసాయం.. అమ్మి పారేసి ఏ దుబాయికో.. కోయిటుకో పోకండా.."

వస్తుగతంగా చూసినప్పుడు భారతీయ రైతాంగానికి, అందులో భాగం అయిపోయిన సాయిబూకు ఏ విషయంలోనూ పెద్ద తేడా ఉన్నట్టు కనిపించదు. కానీ, సూక్ష్మ దృష్టికి వెళ్లినప్పుడు ఆశ్చర్యపడే విషయాలు బయటకు వస్తాయి. అందుకు అనుభవంకావాలి. ఆ అనుభవం రాయలసీమ రైతు బిడ్డ షరీఫ్‌లో దండిగా ఉంది.

మరుసటి రోజు సాయంత్రం నేను మా ఊరెళ్ల డానికి సికింద్రాబాద్ స్టేషన్‌లో కాకతీయలో విండో సీటు దగ్గర కూర్చున్నాను. నేను షరీఫ్ కథల నేపథ్యంలో ముస్లిం వెనుకబాటుతనానికి కారణాలను కాసేపు సచార్ కమిటీలో, మరికాసేపు అస్గర్ ఆలీ ఇంజినీర్ మాటల్లో చూడటం ప్రారంభించాను.

''భారతీయ ముస్లిములందరూ వెనుకబడిన వారు కాదనే విషయాన్ని తెలుసుకోవాలి. ముస్లింల వెనుకబాటు తనానికి కారణం వారి సామాజిక మూలాల్లోనే ఉంది.'' అని అస్గర్ ఆలీ చెప్పారు.

మధ్యయుగాల్లోని సంపన్న ముస్లిం పాలక వర్గాల గురించి వారి సంపద గురించి, రైతాంగం నుంచి వసూలు చేసిన వ్యవసాయ సంపద గురించి కూడా ఆయన చెప్పి ఉన్నారు.

బాగా బతికిన నవాబుగిరి సంపన్న ముస్లింలను కాసేపు మరిచిపోదాం. వెనుకబడిన మస్లింల గురించి మాట్లాడుకుందాం. వారి మూలాల్లోకి వెళ్దాం. శూద్రకులాల నుంచి ప్రజలు ఇస్లాంలోకి చేరినందువల్లే ముస్లింల వెనుకబాటు తనానికి కారణంగా ఆయన చెప్పారు. వివిధ వృత్తుల ఆధారిత ప్రజలు ఇస్లాంలోకి వచ్చినప్పుడు మతం అయితే మారిందికానీ, వృత్తి మారలేదు. పండ్లుఅమ్మేవాళ్లు మాలీలుగా, అద్దకం పనివాళ్లు రంగ్రేజ్‌గా, శవాలకు గోతులు తవ్వేవాళ్లు గోర్కన్లుగా, తమలపాకులు అమ్మేవాళ్లు తంబోలీలుగా, కమ్మరివాళ్లు లోహార్లుగా..ఇలా రకరకాల పేర్లతో ఉన్నారు.

మతం మారింది. వృత్తి మారలేదు. దాన్ని అంటిపెట్టుకుని ఉన్న పేదరికం మారలేదు. ఈ నేపథ్యం నుంచి చూసినప్పుడు రజాక్‌మియా లాంటి సేద్యగాళ్లు ఎక్కడి నుంచి వచ్చి ఉండొచ్చు.. వారిపేదరిక మూలాలు ఎక్కడ ఉండి ఉంటాయి?

''లేదు మేము ముమ్మాటికి ముసల్మానులమే. మా ముత్తాత ముత్తాత రోజుకు ఐదుసార్లు నమాజుకు పోయేవాడట. మా తాత కూడా అంతేనట'' అనే స్వీయ నిర్ధారణతో చాలామంది సంతృప్తి పడేకంటే తమ తమ మూలాల్లోకి వెళితే సరికొత్త విషయాలు తెలిసిరావొచ్చు. తెలుగు ముస్లిం సాహిత్యంలో ఇలాంటి ప్రయత్నమేదీ ఇప్పటివరకు జరగలేదు.

''మేము ముస్లింలం. మేము వెనుకబడిపోయాం'' అనేది సామాజిక వాస్తవమే గానీ, ఆ వెనుకబడినతనానికి చారిత్రక కారణాలను వెదుక్కోవడం నామోషి అనదగిన పనికాదు. అస్గర్ అలీ మరో మాట కూడా ఇలా చెప్పి ఉన్నాడు.

''చాలామంది ముసల్మానులు అత్యంత పేదరికంలో కొట్టుమిట్టాడుతున్నారు.

దీనికి కారణం వారి సామాజికమూలాల్లోని స్వభావం''

ఆ స్వభావం ఏమై ఉంటుంది? రజాక్ మియా పది తరాల వెనక్కి తీసుకెళితే ఆ స్వానుభవంలోని సారం మనకు ఏమైనా అర్థమవుతుందా? ఈ దిశలో షరీఫ ఏదైనా ప్రయాణం చేస్తాడా? వేచి చూడాలి.

ప్రాచీన చైనా వేదాంది మెన్షియస్ ఒకప్పుడు ఇలా అన్నాడట.

''భగవంతుడు వ్యక్తికి గొప్ప వరం ఇవ్వడానికి ముందు ఆ వ్యక్తిని పరిరక్షించడానికి వారినెంతో బాధపెడతాడు. కండలు, ఎముకలు కరిగేటట్లు వారి చేత పని చేయిస్తాడు. వారి శరీరాన్ని ఆకలిబాధకు గురి చేస్తాడు. దారిద్ర్యంతో కుమిలిపోయేటట్టు చేస్తాడు. వారు చేసే ప్రతి పనికి విఘ్నం కలిగిస్తాడు. ఇలాంటి పద్ధతుల ద్వారా భగవంతుడు వారి మానసిక శక్తుల్ని పెంపొందిస్తాడు. వారి స్వభావాన్ని గట్టి పరుస్తాడు..''

షరీఫ్ సాహిత్యపు తలుపులు తెరిచినప్పుడు, ఒకసారి మెన్షియస్‌ను గుర్తుకు తెచ్చుకున్నాడేమో అనిపిస్తుంది. ఎందుకంటే...

**శరీరాన్ని భగవంతుడు ఆకలి బాధకు గురి చేస్తాడు:**

వెంటనే మనకు రజాక్ మియా కుటుంబం గుర్తుకు వస్తుంది. అర్థాకలితో నకనకలాడే వారి డొక్కలు గుర్తుకువస్తాయి. నూకల బస్తా కోసం అలుపెరుగక తిరిగే దీనత్వం గుర్తుకు వస్తుంది.

**వారి నెంతో బాధపెడతాడు :**

'దస్తగిరి చెట్టు' కథలో పిల్లోడికి వాళ్ల అమ్మమ్మ వాళ్ల ఊరుకు పోవాలనేది కోరిక. అమ్మకు మాత్రం అస్సలు ఇష్టం ఉండదు. అమ్మమ్మ వాళ్ల ఊరుకు పోనివ్వనందుకు ఆ పిల్లోడికి ఎంత బాధంటే ఎండ్రిన్ తాగి చచ్చిపోవాలన్నంత బాధ. కొడుకు బాధ చూసి తల్లి కూడా బాధ పడి కళ్ల నీళ్లతో చెబుతుంది.

''అమ్మమ్మోళ్లు పేదోళ్లు... వాళ్లకే తిండికి లేక పచ్చులు ఛస్తాండారు. ఇబ్బుడు నీవు బోయి వోళ్ల పానాల మీద బడితే వోళ్లు నీకెక్కడ్నుంచి తీసుకొచ్చి బెడతారు చెప్పు?''

**వారు చేసే ప్రతి పనికి విఘ్నం కలిగిస్తాడు :**

జమ్రూత్ పెద్ద కొడుకు ఒకరోజు చెప్పాపెట్టకుండా ఎటో ఎల్లిపోయాడు (అంజనం కథ). అందర్నీ కాదనుకుని ఎల్లిపోయాడు. ఎన్నిరోజులు ఎదురుచూసినా సుతిల్యా.. గతిల్యా..! జమ్రూత్ కొడుకు ఆచూకీ కోసం ఏవేవో ప్రయత్నాలు చేసింది.

ప్రతి పనికీ ఏదో ఒక ఆటంకమే.. ఇబ్బందే..!

**దారిద్ర్యంతో కుమిలిపోయేటట్టు చేస్తాడు :**

షరీఫ్ కథాసాహిత్యలో దర్జాగా బతికిన వారి కంటే దారిద్ర్యంలో కుమిలిపోయిన వారే ఎక్కువ.

ఇప్పుడనిపిస్తుంది.. ఆకలి బాధలు పడ్డారు. ఆటంకాలను ఎదుర్కొన్నారు. దారిద్ర్యంలో మునిగితేలారు. కండలు, ఎముకలు కరిగేటట్టు పనిచేశారు. దేవుడి దృష్టిలో ఇప్పుడు వారి మానసిక శక్తులు ఏర్పడ్డాయి. మరిఆ భగవంతుడు వారికి గొప్ప వరం ఇచ్చే రోజు ఎప్పుడు వస్తుంది?

**ఇంకా ఏం ఉంది షరీఫ్ కథల్లో?**

"జేజి నీ మాటలే పాడుతాం.. మా చెవులు రింగుమని మారు మోగేవరకు.." అనే ధైర్యం ఉంది.

'పర్దా' కథలో జేజి ముసలమ్మ ఏడిపించనిది ఎవరిని? 'ఆకుపచ్చముగ్గు' లయగా ప్రాణం పోసుకుంటున్న సుందర దృశ్యాన్ని ఎన్ని సార్లు విడమరిచి చెప్పినా.. చెప్పాల్సింది..ఎంతో కొంత మిగిలే ఉంటుంది.

షరీఫ్ కథల్లో యావత్ రాయలసీమ కనిపిస్తుంది. నోరు లేని మూగ పొలాలు కనబడతాయి. మడికట్లలో పడి నడిచే సాయేబు రైతు కనబడతాడు. భౌగోళిక అస్తిత్వం కనిపిస్తుంది. అందులోనే మత అస్తిత్వం కనిపిస్తుంది. ఈ రెండింటినీ సమన్వయం చేసుకుని చిత్రం గీస్తున్న సమయంలో ఇదివరకు ఎవరూ గీయని చిత్రాలు కనిపిస్తాయి. అరచేతులు రెండూ తెరిచాను. దస్తగిరి చెట్టు కనిపించింది. నా మొక్కును ఆ చెట్టుకు పదిలంగా కట్టుకున్నాను.

షరీఫ్ ఇలాగేరాయాలి. పేదోడి కష్టాల గురించి, ఖాళీ అయిపోతున్న మనిషి గురించి, సామాజిక విధ్వంసాల గురించి, ఆ ధాటికి గుండె చెదిరిన అమ్మల గురించి, వారి ప్రియమైన కొడుకుల గురించి, మత వైరుధ్యాల గురించి, ఎల్లలు చెరిపేసి ఒకరి ఆత్మను మరొకరు ఆలింగనలు చేసుకునే అపురూప సాంస్కృతిక విశ్వరూపం గురించి, ఒకే మనిషిలో ఉండే అనేక చీకటి లోయల గురించి, ఆ లోయల అంచుల్లో సన్నగా పారుతున్న వెలుతురు గురించి... ఇంకా.. ఇంకా.. ఇలాగే..రాస్తూ ఉండాలి.

ఆ సాయంకాలం పూట అలా నడుచుకుంటూ వెళ్తున్నప్పుడు వేపచెట్టు కొమ్మల్లో తెల్లటి నెలవంకతో వెలిగిపోతూ, గాలికి ఊగిపోతున్న పచ్చటి కందూరు

జెండా.. ''షరీఫ్‌ని చదివినట్లే కదా..'' అని అడిగింది.

''చదివేశాను..'' అని నేను ఎప్పుడూ అనను.

చదువుతాను. చదువుతూనేఉంటాను. ఇది అంతులేనిపఠనం. ఆపి, విశ్రాంతి తీసుకోవడానికి అనువుగాని సందర్భం. ఇంకా నేను చదువుతూనే ఉన్నాను.

ఇక సౌభాగ్య గురించి నాలుగు మాటలు చెప్పాల్సి వస్తే 'షరీఫ్ కథల గురించి లోతైన విశ్లేషణ ఒకటి జరిగితే బావుండేది..' అనే నా కోరిక సౌభాగ్య రూపంలో తీరింది. మంచి కవిత, మంచి కథ.. ఇలా ఏ సాహిత్య ప్రక్రియ అయినా ఆయనకు నచ్చితే కాలికి బలపం కట్టుకుని ప్రచారం చేస్తారని 'సౌభాగ్య' గురించి షరీఫ్ మాటల్లో విని ఉన్నాను.

తన గురించి తాను మాత్రమే, తన వారి గురించి మాత్రమే ఆలోచించగలిగే వర్తమాన సాహిత్య సమాజంలో ఒక సృజన శీలి మరొక సృజనశీలి గురించి ఆలోచించడం, వాటిని విశ్లేషిస్తూ పాఠకులకు కొత్త దృష్టిని ఇవ్వడం మంచిపని అనిపిస్తుంది. ఈ ప్రయత్నాన్ని వారిద్దరి స్నేహ సంబంధాలలోనో, ఆత్మీయత అనురాగాల్లోనో చూడకుండా... ఒక యువకథకుడికి సీనియర్ విమర్శకుడి నుంచి వచ్చిన అత్యుత్తమ ప్రోత్సాహకంగా భావించాలి. పాశ్చాత్య కథా సాహిత్యంలో ఏ చిన్న కథ, కవిత, నవలకు అయినా విశ్లేషణలతో కూడిన పుస్తకాలు బోలెడు వస్తాయి. అలాంటివి మన తెలుగులో చాలా తక్కువ. పుసుక్కున ఒక కథ వివాదం అయితే తప్ప అలాంటి అదృష్టం మనకు దక్కదు.

సాహిత్య పేజీల్లో రచయిత సృజన గురించి అడపాదడపా విశ్లేషణలు వచ్చినా వాటి సమీకరణలు, తూకాలు వేరుగా కనిపిస్తాయి. ఈ నేపథ్యంలో 'సాహిత్య పేజీ' అనే ఏకైక ప్రమాణాన్ని మాత్రమే సృజన తాలూకు ప్రతిభకు నిలువుటద్దంగా చూడనక్కర్లేదు.

ఈ పుస్తకంలో పదిహేను వ్యాసాలున్నాయి. అవి కూడా కథల్లానే ఉన్నాయి. కొన్ని చోట్ల అవి కథలకు తోబుట్టువుల్లా ఉన్నాయి. నాకైతే 'షరీఫ్ కథలు.. సౌభాగ్య వ్యాసాలు' కవల పిల్లల మాదిరిగా కనిపించాయి. వాటిని ఎప్పుడూ చేతుల్లోకి తీసుకుంటాను. ఆత్మీయంగా గుండెన పెట్టుకుంటాను. పరిచయస్థులకు చూపి మురిసిపోతాను.

*హైదరాబాద్, 5 ఏప్రిల్ 2012*

## ఇందులో...

# నేను - షరీఫ్

మనం కొంతమంది కోసం వెతుకుతూ ఉంటాం. అలాంటి వ్యక్తులు జీవితంలో తటస్థపడితే బావుండు అనుకుంటాం. వాళ్లు మనకు స్నేహితులవ్వాలని ఆశపడతాం. కాల ప్రవాహంలో అది అందరికీ వీలుపడదు. ఆశ ఆశగా మిగిలిపోయి ఎందరో నిష్క్రమిస్తారు. కానీ కొంతమంది అదృష్టవంతులుంటారు. వాళ్లు అనుకున్నవన్నీ జరుగుతాయి. ఆశలన్నీ నెరవేరుతాయి. అట్లాంటి అదృష్టవంతుల్లో నేనొక్కణ్ని.

నిజానికి అట్లాంటి అదృష్టం అందరికీ వీలవుతుంది. ఆ అదృష్టానికి మన మనసును సిద్ధం చేయాలి. ఆహ్వానానికి సిద్ధపడి ఉండాలి. అహంకార భయాల్ని దగ్గరికి రానివ్వకూడదు. అక్కడ ఎట్లాంటి ప్రయోజనాల ప్రసక్తీ ఉండకూడదు. మనిషి మనిషి కోసం ఎదురు చూడ్డమొక్కటే ఉండాలి.

మానవసంబంధాల్లో ఇచ్చిపుచ్చుకోవడాలు ఉంటాయి. వ్యాపార ప్రయోజనాలుంటాయి. లావాదేవీలు ఉంటాయి. అవి నిజమైన సంబంధాలు కావు. ప్రాపంచిక సంబంధాలు. నిజమైన సాహిత్య ప్రేమికుల సంబంధాల్లో అవి ఉండవు. తమ అనుభూతుల్ని పరస్పరం ఇచ్చి పుచ్చుకోవడం కోసం ఎందరో అల్లాడుతారు. భావ వినిమయం కోసం తపిస్తారు. ప్రయోజనాల్ని ఆశించనప్పుడు మనల్ని ప్రకృతి కూడా చల్లగా చూస్తుంది.

షరీఫ్ గురించి నాకు తెలీదు. పేరు విన్నానే కానీ అతనివి ఏవీ నేను చదవలేదు. కవులు కవిత్వం మాత్రమే చదవడమన్న దురలవాటు మన వాళ్లకుంది. వాళ్లకు రచయితల గురించి తెలీదు. రచయితలకైనా కవుల గురించి తెలియడం అరుదు.

ఆరోజు సాయంత్రం షరీఫ్ నాకు ఫోన్ చేశాడు.

"సార్.. నమస్తే.. నా పేరు షరీఫ్. నా చిన్నప్పటి నుంచి మీ పేరు చూస్తున్నాను. ఎప్పట్నుంచో మీతో మాట్లాడాలనుకుంటున్నాను.."అన్నాడు.

ఫలాన పత్రికలో పని చేస్తున్నట్టు కూడా చెప్పాడు.

నాకు సంతోషమేసింది. "మీరు కవికదా.." అన్నాను.

"కాదండీ..నేను కథకుణ్ణీ.."అన్నాడు.

"మీరు ఎక్కడుంటున్నారని" అడిగాను.

"దగ్గర్లోనే ఉన్నా"నన్నాడు.

"మిమ్మల్ని కలిస్తే ఇబ్బంది లేదు కదా.."అన్నాను.

"ఎంత మాట" అన్నాడు.

ఒక దగ్గర కలిశాం. నా దగ్గరున్న పుస్తకాలు ఇచ్చాను. అప్పుడే తాజాగా వచ్చిన అతని 'జుమ్మా' కథల పుస్తకం ఇచ్చాడు.

ముప్పయ్యేళ్ల క్రితం నేను యూనివర్సిటీలో చదువుకుంటున్నప్పుడు ముచ్చటగా, లేతగా, బత్తాయి పండులా ఉండే నా మిత్రుడు బాలకుమార్ గుర్తొచ్చాడు. షరీఫ్ మహానగరంలో ఉంటూ మల్లెపువ్వులా ఉండటం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఎంత స్వచ్ఛంగా, ఎంత సహజంగా, ఎంత ప్రేమగా, ఎలాంటి భ్రమలూ లేకుండా తొణికిసలాడే ప్రేమతో లేత అలలా కనిపించాడు. నాకన్నా ముప్పయ్ ఏళ్లు చిన్నవాడు. నాతో ఎంతో ప్రేమగా మాట్లాడ్డం నాకు ఎంతో ఆనందాన్నిచ్చింది. ప్రతి పది సంవత్సరాల తేడా ఉన్న మనుషుల్లో భావ వినిమయంలో కొంత గ్యాప్ ఉంటుందంటారు సైకాలజిస్టులు.

కానీ నిరహంకార నిర్మల స్నేహితుడు వయసుతో సంబంధం లేని పసితనాన్ని, స్నేహాన్ని నాలో చూశాడు. ఎంతో ఆత్మీయంగా మనసు విప్పాడు. ఎప్పుడో కలుసుకుని ఎప్పుడో విడిపోయి మళ్లీ కలుస్తున్నంత ఆనందం నాలో కలిగింది.

మానవత్వం, మంచితనం, ఉత్సాహం, ఉల్లాసం నిండిన ఈ కుర్రాడి పలకరింపుతో నన్ను సమీపిస్తున్న వృద్ధాప్యం భయపడింది. నా వయసు నుంచి నన్ను బయటికి లాగి తన పసితనంతో కలిపేసుకుని అతని భావనా ప్రపంచంలో

విహరించే అవకాశమిచ్చిన అతనికి మనసులోనే కృతజ్ఞతలు తెలుపుకున్నాను. అతని దగ్గరి నుంచి సెలవు తీసుకుని ఇంటికెళ్లడానికి బస్సెక్కి కూచుని పుస్తకం తీసి చూశాను. అంతవరకు మాత్రమే నా ప్రమేయంతో జరిగింది. ఆ తర్వాతంతా పుస్తకమే నన్ను లాక్కెళ్లింది. నిజానికి ఎంతో మంది నాకు ఫోన్ చేసి తమ మీద ఏదైనా రాయమని అడుగుతూ ఉంటారు. షరీఫ్ అలా అడగలేదు. పుస్తకం చదివాక అభిప్రాయం చెప్పమన్నాడంతే. కానీ ''నా పాలిట దేవుడు మా మాబ్బాష మామ'' అనే ముందుమాటతోనే షరీఫ్ నన్ను ఆక్రమించేశాడు. ముందు మాటలో అతని అనుభవం చదివాక కళ్లు చమర్చాయి. ఈ పుస్తకం చదివాక అతనికి అభిప్రాయమే రాద్దామనుకున్నాను..కానీ అది ఇలా పుస్తకమవుతుందని అప్పుడు నేనూ అనుకోలేదు.

✡

# మామ -చందమామ

ప్రతి మనిషి పుట్టుకతో ఆనందాన్ని వెంట తెచ్చుకుంటాడు. ఆనందం మనిషి అంతస్సారం. దాన్ని జీవితాంతం కొంతమందే నిలుపుకుంటారు. ఎన్నో అనుభవ పొరలు ఆ ఆనందాన్ని మసక బారేలా చేస్తాయి. ఏ అనుభవాన్నయినా విశ్లేషించుకునే చురుకుదనం, చైతన్యం కొంత మందికే ఉంటుంది. ఆ పసితనపు పరిమళాన్ని మనకు అందించే ప్రతిభావంతుడు షరీఫ్. తనతో పాటు ఆ పసితనాన్ని వదలకుండా తీసుకెళ్తున్నాడు.

చిన్నితనంలో ప్రతి తల్లిదండ్రులూ పిల్లల్ని ప్రేమగానే పెంచుతారు. కొందరు గారాభం చేస్తారు. అది కొద్ది మంది నిర్లక్ష్యం చేస్తారు. తమకు వీలైనన్ని అనుకూలాలు సమకూరుస్తూ ప్రేమగా పెంచుతున్న తల్లిదండ్రుల్ని, బంధువుల్ని పసితనంలోనే కొంతమంది పరిశీలిస్తారు. వాళ్లు తల్లిదండ్రులైనా, ఇతరులైనా వాళ్ల పట్ల మమకారాన్ని కలిగి ఉంటారు. వాళ్ల బాధలకు స్పందిస్తారు. వాళ్లకష్టాలకు కన్నీళ్లు పెట్టుకుంటారు. అనుక్షణం తమను ఆనందంగా ఉంచడానికి వాళ్లు పడే తాపత్రయాల్ని చూసి తల్లడిల్లుతారు. పసితనంలోనే అంత డిచాట్జ్‌గా మనషుల్ని చూడగలగడమన్న పనిని గతంలో ఖదీర్‌బాబు చేశాడు. ఇప్పుడు షరీఫ్ చేస్తున్నాడు.

షరీఫ్ మాటల్లో మల్లెల పరిమళముంది. అతని అక్షరాల్లో గొప్ప కాంతి ఉంది. అతని దర్శనలో గొప్పవివేకముంది. అనురాగంతో ఆలోచనని మేళవించే నైపుణ్యాన్ని పుట్టుకతో తెచ్చుకున్నట్లనిపిస్తాడు షరీఫ్.

పసితనంలోని తన తత్వాన్ని 'జుమ్మా' కథా సంపుటి ముందు మాటలో చెప్పుకున్నాడు.

"మొదట నన్ను ఇంట్లో అందరూ మెంటలోడు.." అనేకునేవాళ్లు అనే వాక్యంతో అతని ముందు మాట మొదలవుతుంది. షరీఫ్ చిన్నప్పుడు పిచ్చిపిచ్చిగా ఏవేవో రాసేవాడు.. మిద్దెపైనెక్కి రాసి కాగితాలు చింపి పారేసేవాడు. అప్పుడు అందరూ అతన్ని ఇంట్లో మెంటలోడు అనుకునేవాళ్లు. అలాంటి సమయంలో ఓరోజు..

షరీఫ్ వాళ్ల ఇంటికి మాబ్బాష మామ వస్తాడు. వచ్చి గూట్లో కుక్కిన ఏవో కొన్ని కాగితాలను తీసి చదివి ఎంతో గొప్పగా ఉన్నాయని ఆశ్చర్యపోతాడు. వెంటనే షరీఫ్ వాళ్ల అమ్మ ముందు " అక్కా..ఏమి రాచ్చాండాడక్కా వీడు.. వీడి వయసుకి రాతలకి సమ్మందమే లేదు. ఏదీ ఒకసారి రాసింది సదివి వినిపిచ్చరా.." అంటాడు.

ఆరిపోతున్న దీపాన్ని ఎగదోసినట్టు అనిపించి ఎంతో ఉత్సాహంగా తాను రాసింది చదివి వినిపిస్తాడు షరీఫ్. అతను రాసినవి వాళ్లకేమీ అర్థమవ్వవు కానీ ఇతనిలో ఏదో టాలెంట్ ఉందని మాత్రం గుర్తించి ఆ తర్వాత అతన్ని ఎవరూ తక్కువ చేయరు. ప్రోత్సాహం లేకపోయినా పర్వాలేదు కానీ మనిషిని తక్కువ చేయకపోతే చాలు కదా... అదే కొండంత వరం.

మెల్లగా షరీఫ్‌కి మామతో సాన్నిహిత్యం పెరుగుతుంది. మామకు అల్లుడి మీద అంతులేని అనురాగం పుడుతుంది. ఆ అనురాగం వెనుక కారణాన్ని వివరిస్తూ ఆయనే స్వయంగా మేనల్లుడుతో ఇలా అంటాడు.

"ఒరేయ్..మేనల్లుడా.. నాగ్గుడక ఇలా రాయాలని ఉండాదిరా. సినిమా కథలు రాసి రైటర్ అవ్వాలనికోరిక. ఏమంటే దేవుడుపెద్దగా సదువియ్యక(రెండోతరగతి) నేను ఈడ్నే సిక్కుబడిపోయినాను. ఇన్నాళ్లకు నాకు నువ్వొకడివి దొరికినావు. నేను కాలేకపోయినా కానీ నవ్వు మాత్రం పెద్ద రైటర్ కావాల్రా.."

మనిషికి నమ్మకాన్ని, ప్రేమను ఇచ్చేవాళ్లు దేవుని ప్రతినిధులు. షరీఫ్ గొప్ప రచయితగా మారి ప్రపంచ ప్రసిద్ధుడు కాకపోవచ్చు. కోటీశ్వరులు, కోటానుకోట్ల జనాలు అందుకోలేని ఒక సంతృప్తిని, సంతోషాన్ని తన మామ మాటల్నించి అందుకున్నాడు. అతని మామలో ఆశలున్నాయి. అవి సర్వసాధారణమైనవి. డబ్బుతో ముడిపడినవి. సినిమాకురాసే రచయితలు బాగా డబ్బు, పేరు గడిస్తారని, వాళ్లు

గొప్పవాళ్లని సాధారణ జనం అనుకుంటారు. షరీఫ్ మామ కూడా అలాగే అనుకున్నాడు. మామ అల్లుడికి అన్ని అనుకూలాలు కల్పించాడు. మనిషికి భౌతికమైన అనుకూలాలు సుఖాన్నిస్తాయి. మానసికమైన అనుకూలాలు ఆనందాన్నిస్తాయి. అలాగే భౌతిక మైన సుఖాలు బుద్ధిని మందగిస్తాయి. మానసికమైన అనుకూలాలు తనని దాటి ప్రపంచాన్ని పరిశీలించే శక్తినిస్తాయి. చైతన్యాన్నిస్తాయి. అందుకనే షరీఫ్ సంపన్నుడయ్యాడు. ఆ పూర్వ రంగాన్ని గురించి ఇలా చాలా అపూర్వంగా వివరించాడు.

"అద్దె ఆటో తోలితే కానీ పూటగడవని మామ.. నన్ను తీసుకెళ్లి మూన్నెళ్లు ఇంట్లో ఉంచుకుని, 'నీకేం పని చెప్పను.. తింటూఉండు.. రాసుకుంటూ ఉండు.. ఇక్కడ నీకెవ్వరూ అడ్డు లేరు..'అని ఫుల్ స్వేచ్ఛనిచ్చాడు. నా రాతలంటే అంత గౌరవం.. అంత నమ్మకం మామకు"

మనకు మన మీద నమ్మకముండటం మంచిదే. ఆ నమ్మకాన్ని ఇతరులు గుర్తించినప్పుడే  ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఆ రకంగా షరీఫ్ రచనలకు పునాది పడింది. అప్పటికే పిల్లల కథలు రాయడం అలవాటు చేసుకున్న ఈ పసివాడు అచ్చులో వచ్చిన తన కథల్ని చూపించి మామని ఆశ్చర్యానికి గురిచేశాడు.

అల్లుడి మీద మామ నమ్మకం అక్కడితో ఆగలేదు. నిరంతరం అల్లుడి అభివృద్ధి కోసం మామ ఎన్నో కష్టాలు పడ్డాడు. చదువు పూర్తి చేసుకున్న షరీఫ్ ఎక్కడైనా పత్రికల్లో చేరితే పైకి వస్తాడని ఎందరినో ఆశ్రయించాడు.

"తన మాటకు విలువివ్వరని తెలిసినా ఆ రెడ్డీ.. ఈ రెడ్డీ కాళ్లు పట్టుకుని నా గురించి, నా రాతల గురించి గొప్పగా చెప్పి ఉద్యోగం ఇప్పించమని బతిమాలినాడు. ఆటోను బాడిగలకు తిప్పడం మానేసి నాకోసం తిప్పినాడు. ఆటో ఒనరుకు.. వారాల తరబడి అప్పుడు పడినాడు.." అంటూ తన మామ గురించి చెబుతూ కదిలిపోతాడు షరీఫ్.

మనకు మేనమామ బతకగోరు..దాయాది చావగోరు..అని సామెత ఉంది. అట్లా మేనల్లుడు చల్లగా ఉండాలని ఈ మేనమామ ఎంత ఆరాటపడ్డాడో.

మొత్తానికి ఎట్లాగో పత్రికలో ఉద్యోగం సంపాదించి షరీఫ్ నగరానికి చేరాడు. తన మొదటి కథల సంపుటి అచ్చువేసుకున్నాడు. దానికి తన మామ ఇచ్చిన ప్రోత్సాహమే కారణమని చెప్పుకుంటాడు. ఆయన ఇచ్చిన ప్రేరణ వల్లే తనకో జీవితం ఏర్పడిందని చెప్పుకుంటూ " మామ ప్రోత్సాహంతో నేను నాలుగు రాతలు నేర్చుకుని ఇప్పుడు ఉద్యోగం చేసుకుంటూ సుఖంగా ఉంటే మా మామ మాత్రం ఇప్పటికీ

అదే అద్దె ఆటో తోలుకుంటూ అదే సగం కడుపుతో పడుకుంటున్నాడు" అని బాధ పడతాడు.

ఈ మాటలు చదివి మనకంట్లో కూడా నీళ్లు కదుల్తాయి. షరీఫ్ కలెక్టర్ కాలేదు.. టాటా కాలేదు.. బిర్లా కాలేదు. ఒక చిన్ని ఉద్యోగం సంపాదించాడు. ఒక కథల సంపుటి అచ్చేసుకున్నాడు. అది అనంత ఐశ్వర్యమైనట్టు తాను ఎంతో స్థాయికి చేరుకున్నట్టు తనమామ ఇంకా ఎదుగూబొదుగులేని ఆటో డ్రైవర్‌గానే మిగిలిపోయినట్టు పసివాడిలా పరివేదన చెందుతాడు.

కృతజ్ఞత షరీఫ్‌కి రక్తనిష్ఠమైన లక్షణం. తన పట్ల ప్రేమని ప్రదర్శించిన అందరూ తన ఎదుగుదలకు తోడ్పడ్డారని వాళ్లకు తలవంచి నమస్కరిస్తాడు.

సాహిత్యరంగమన్నదే అదృశ్యమవుతున్న ఈ వాతావరణంలో ఒంటరి తారలా నిలబడి మానవానుభూతుల్ని మణిదీపాల్లా వెలిగిస్తున్న ఈ మహా ప్రేమికుడి మందహాసానికి మనమంతా మంత్ర ముగ్ధులమవుతాం.

✡

# మతాన్ని మించింది జీవితం

షరీఫ్ చెప్పేవి కథలు కావు. అనుభవాలు. అతి సాధారణమైన తన జీవితంలో ఒక సంఘటనని, అనుభవాన్ని పువ్వు విచ్చుకున్నట్టు వివరిస్తాడు. వెన్నెల- మైదానంలో విస్తరించినట్టు విశ్లేషిస్తాడు. అక్కడ నిర్ణయాలుండవు. పక్షపాతముండదు. సిద్ధాంతముండదు. మతముండదు. మనల్ని అల్లుకునే మందపవనం ఉంటుంది. ప్రాపంచిక సరిహద్దులు దాటిన సౌందర్యం ఉంటుంది. అంతులేని సౌకుమార్యం ఉండి అది మనల్ని ఆశ్చర్యానికి లోనుచేస్తుంది.

వ్యక్తిగా కూడా ఈ రచయిత ఎంత ఉత్తముడో, ఉన్నతుడో మనకు అతని కథల ద్వారే తెలిసిపోతుంది. అతని పట్ల మనకు గౌరవం కలుగుతుంది. ఒక లేత జలపాతంలా, చల్లగా సాగే ఏటిపాయలా అతని శైలి మృదుమధురంగా మున్ముందుకు నడిపిస్తుంది. కాలుష్యమంటని కరుణ అతని అక్షరాల్ని రక్షిస్తూ ఉంటుంది. అనురాగం అతని అక్షరాల్లో తొణికిసలాడుతూఉంటుంది.

షరీఫ్‌లో అలవిమీరిన అవేశాలుండవు. నిర్మలంగా నిష్కల్మషంగా అన్నిటినీ చూడటం అతనిలో కనిపిస్తుంది. అతని కథ 'జుమ్మా' చదివితే దిమ్మతిరుగుతుంది. వీలైనంత పక్షపాతాన్ని కుమ్మరించే వీలున్న వస్తువు అతని కళ్లముందు ఉంది.

ఉద్రేకాల్ని రెచ్చగొట్టడానికి కావాల్సిన సరంజామా సంసిద్ధంగా ఉంది. అయినా అతను నిలువెల్లా మానవత్వం మూర్తీభవిస్తాడు.

అతను ముస్లిం కాడు, హిందువు కాడు., క్రిస్టియన్ కాడు.

'ప్రపంచంలో ఎక్కడ చూసినా హిందువులు కనిపిస్తున్నారు, ముస్లిములు కనిపిస్తున్నారు, కానీ మనిషన్న వాడు ఎక్కడా కనిపించడే..' అని ఒక ఉర్దూ కవి వాపోయాడు. అతను గనుక తారసడితే నేను షరీఫ్‌ని చూపిస్తాను. మతమంటని, మాలిన్యమంటని ఈ మణిపూసని అప్పగిస్తాను.

షరీఫ్ రచనా విధానం అపూర్వం. దృశ్యాన్ని వర్ణిస్తూ ఉన్నట్టే ఉంటాడు కానీ దు:ఖాన్ని కూడా ఆవిష్కరిస్తాడు. దృశ్యానికి, దు:ఖానికి అందని గొప్ప జీవిత సత్యాల్ని చెబుతాడు. జరిగిన సంఘటనని కథగా మలుస్తూ పాత్రల్లో వచ్చిన పరివర్తనని ప్రదర్శిస్తూ వాటి పట్ల మనలో సహానుభూతిని రేకెత్తిస్తాడు.

'జుమ్మా' కథలో కథానాయకుడు మూడేళ్ల క్రితం ఉద్యోగ రీత్యా హైదరాబాద్ వస్తాడు. ఊళ్లో చిన్నప్పుడు అతని తల్లి అతన్ని శుక్రవారాలు మసీదుకు వెళ్లాలని పోరుతూ ఉంటుంది. తల్లి బాధ పడలేక అప్పుడప్పుడూ నమాజుకు వెళ్లేవాడు. నమాజుకు వెళితే అల్లా చల్లగా చూస్తాడని ఆమె చెబుతుంది.

కొడుకు హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తుండటం వల్ల ఒకసారి ఆమె ఇక్కడికి వస్తుంది. ఆమెకు సిటీ చూపిస్తూ మక్కా మసీదుకు కూడా తీసుకెళ్తాడు కథా నాయకుడు.

ఆ పెద్ద మసీదును చూసి తన్మయత్వం చెందిన అతని తల్లి 'ఇట్లాంటి మసీదులో నమాజు చేస్తే పుణ్యమొస్తుంది. నవ్వు తప్పక శుక్రవారాలు ఇక్కడికొచ్చి నమాజు చెయ్యి'అంటుంది. హైదరాబాద్‌లో తాను ఉంటున్న ప్రాంతం మక్కా మసీదుకు చాలా దూరమైనప్పటికీ తల్లి మాటకు ఎదురు చెప్పలేక సరేనంటాడతను. తర్వాత తల్లి ఊరెళ్లిపోతుంది.

కొద్దిరోజులకు హైదరాబాద్‌లోని అదే మసీదులో బాంబు బ్లాస్ట్ జరుగుతుంది. ఆ వార్త విని తల్లి కొడుక్కి ఫోన్ చేసి "క్షేమంగా ఉన్నావా..?" అని అడుగుతుంది. క్షేమంగా ఉన్నానని చెబుతూనే "బాంబు పేలుడు ఎక్కడ జరిగిందో తెలుసా మా?" అని అడుగుతాడు తల్లిని ఆత్రంగా అతను.

మళ్లీ అతనే "నువ్వు తప్పక వెళ్లి నమాజు చదవమన్నావే.. ఆ మసీదులోనే మా.. బాంబు పేలింది..." అంటాడు.

"అవును, తెలుసు నాయనా.. నువ్వు అటు వైపు వెళ్లలేదుకదా.. వెళ్లకు.." అని తల్లి అనడంతో కథ ముగుస్తుంది.

అంటే ఏ మసీదుకైతే తల్లి వెళ్లమని ప్రతి రోజూ పోరుతూ ఉంటుందో అదే మసీదు తన బిడ్డ ప్రాణానికి ముప్పు అని తెలిసిన తర్వాత అక్కడ నమాజు వద్దంటుంది. అందుకే కథానాయకుడు కన్నీళ్ల పర్యంతం అవుతాడు.

"అమ్మేనా.. ఇలా అంటోంది.., అమ్మేనా.. మసీదు వైపుకు వెళ్లొద్దంటోంది.. కన్న బిడ్డ ప్రాణం ముందు మసీదు కానిదైందా? అల్లా క్షమించు..మరో శుక్రవారం ఎక్కడా నెత్తురోడకుండా చూడు.." అంటూ వేడుకుంటాడు. ప్రార్థిస్తాడు.

మత విశ్వాసాల కన్నా మమతానురాగాలే ముఖ్యమైనవని మనకు అప్పుడు తడుతుంది. కానీ ఎక్కడా రచయిత తనకు తానై కథలోకి ప్రవేశించి ఎక్కడా ఎలాంటి స్టేట్ మెంట్లు ఇవ్వడు. నిర్ణయాలు చేయడు. జరిగినదాన్ని జరిగినట్టుగా వివరిస్తూ ఆయా సందర్భంలో పాత్రల స్పందనల్ని మనముందు ఉంచుతాడు అంతే. తర్వాత నిర్ణయాలు చేసుకోవాల్సింది మనం.

అన్నిటికన్నా దారుణం ఏమిటంటే నమ్మకం గాయపడడం. నమ్మకం గాయపడితే ఎన్నో వైపరీత్యాలు జరుగుతాయి. తీవ్రవాదాలు రంగంలోకి వస్తాయి. తన అభిప్రాయాన్ని, విశ్వాసాల్ని విశృంఖలంగా వెదజల్లే వీలున్న ఈ రచయిత దేశాన్నో, మతాన్నో ఉద్ధరించడానికి కంకణం కట్టుకోలేదు.

తాను కూడా ఓ సర్వ సాధారణమైన మనిషినని నమ్మాడు. అందుకే తల్లి, తండ్రి, అక్కలు, అన్నలు, స్నేహితులు.. వాళ్లు చేస్తున్న పని, ఆ పనికి సంబంధించిన కష్టసుఖాలే జీవితమనుకున్నాడు. తనకే కాదు ఎవరికైనా అదే జీవితమని షరీఫ్‌కి బాగా తెలుసు. తన చైతన్యాన్ని కప్పేసి, తన విచక్షణకి, వివేచనకి, ఆహ్లాదకరమైన అనుబంధాలకి ఆటంకం కలిగించేది ఏదీ నిజం కాదని తన చిన్న తనంలోనే తెలుసుకున్న షరీఫ్ అదృష్టవంతుడు. ప్రేమ ఒక్కటే మానవ రుగ్మతల కన్నీటికీ ఔషధమని అతను కనుగొన్నాడు.

అతనికి తల్లంటే అమితమైన గౌరవముంది. ఆమె మాటంటే గురి ఉంది. అందుకే అతను కథలో లీనమవ్వగలిగాడు. తల్లీ - బిడ్డల మధ్య సంభాషణ అంత ఆర్ద్రతగా పండించగలిగాడు.

ఆమె నగరానికి వచ్చి కొడుకును చూస్తుంది. ఎక్కడో మారుమూల గ్రామంలో ఉండే నా బిడ్డ ఇంత పెద్ద నగరంలో ఉద్యోగం చేస్తున్నాడని గర్విస్తుంది. గొప్పవాడయ్యాడని ఆనందంతో కన్నీళ్లు పెట్టుకుంటుంది. అప్పుడు కథలోని కొడుకు

ఆమె కన్నీళ్లను ఇలా తుడుస్తాడు.

"మా.. బతుకు మీద కసితో వచ్చాను. ఎన్నో కష్టాలు ఓర్చుకున్నాను. నాకు నేనే ధైర్యం చెప్పుకున్నాను. జ్వరం వచ్చినా నాకు నేను బరువుగా లేచి వెళ్లి టాబ్లెట్లు తెచ్చుకున్నాను. సూది వేయించుకున్నాను. అయినా మా.. నీ ఆశీస్సులుండబట్టే కదా.. ఇంత సిటీలో నా అన్నవాళ్లు ఎవరూ లేకపోయినా ఒంటరిననుకోకుండా బతుకుతున్నాను.."

ఈ మాటలు చదివినప్పుడు మనకు గుండెల్లో ఎక్కడో కలుక్కుమంటుంది. నిజానికి ఆ మాటల్లో షరీఫ్ వ్యక్తిత్వం ఉంది. దేన్నయినా ఒంటరిగా ఎదుర్కొనే ధైర్యం ఉంది. జీవితంలో కష్టమొకటే నిజమని రచయితకి తెలుసు. దాన్ని సూటిగా సరాసరిగా ఎదుర్కొనే ఆత్మస్థయిర్యాన్ని కూడా అతను కుటుంబ ప్రేమ నుంచే పొందాడు. అందువల్ల అతనికి భ్రమలు లేవు. భ్రాంతులు లేవు.

కథలో తల్లీ బిడ్డల మధ్య ఆ ఆత్మీయ సంభాషణ ముగిశాకా ఇతర విషయాలు చర్చకొస్తాయి.

"శుక్కురారం.. శుక్కురారం.. నమాజుకు వెళ్తాండావారా.." అంటుంది తల్లి.

"లేదమ్మా.. యాడ వీలవుతుంది చెప్పు?"అంటాడతను.

"ఎప్పుడూ వీలవదు నాయనా! కానీవెళ్లిరావాల. తప్పదు. సాయిబూలై పుట్టినాక కనీసం వారానికొకసారైనా నమాజుకు వెళ్లాల.." అంటుంది.

ఆమె మళ్లీ పాత కథే ఎత్తుకుందని భావించిన కొడుకు ఆ విషయాన్ని మళ్లించడానికి ...

"మా ఇక్కడ మక్కా మసీదని పెద్ద మసీదు ఉంది తెలుసా..?" అంటాడు. నేరుగా ఆమెను మక్కా మసీదుకే తీసుకెళ్లాడు.

నమాజు ప్రసక్తి నించి మాటల్ని మరల్చడానికి ప్రయత్నించిన కొడుకు చేతే తిరిగి ఆమెను మసీదుకు తీసుకెళ్లేలా చేస్తాడు రచయిత. అది పారడాక్స్ అంటే.

షరీఫ్ దేనికీ వ్యతిరేకం కాదు.. దేనికీ అనుకూలం కాదు. బాహ్యమైన ఆచారవ్యవహారాలను అతను వ్యతిరేకించడు. అట్లా అని అనివార్యంగా వాటిని ఆమోదించాలని అనడు. మన జీవన గమనానికి ఆటంకం కానంతమేరకు వాటిని ఆమోదించడం అతన్లో కనిపిస్తుంది.

గొప్ప వివేకవంతుల్లో, జ్ఞానుల్లో కనిపించే సంయమనం అతన్లో కనిపిస్తుంది. ఆధ్యాత్మిక పరిభాషలో 'స్టిల్ నెస్' అంటామే అట్లాంటి నిశ్చలత్వం షరీఫ్‌లో ఉంది.

అది పుస్తకాలు చదువుకోవడం ద్వారా వచ్చేది కాదు. అతనికే తెలియకుండా అతనిలో ఆ లక్షణం రూపు దిద్దుకుంది. ఆ రసాయనిక సంయోజనం ఎప్పుడు ఎలా జరిగిందో చెప్పలేం. 'చిర్నవ్వు దీపాన్ని' చిరంతనంగా వెలిగించుకుని దాన్ని కాపాడుకోవడం అతనికి తెలుసు. అతను ఎప్పటికీ చిగురుటాకులా మిగిలిపోవడానికే ఇష్టపడతాడు. లేత కోడిపిల్లలాంటి వాడు. అదే సమయంలో తుఫాను నడుమ నిశ్చల కేంద్రంలా కూడా నిలబడతాడు.

బాంబు అతనికి మసీదులో పేలినా... మందిరంలో పేలినా ఒక్కటే. నమ్మకాల్ని దాటి మానవత్వంతో కదిలే అతని వివేచనలో మార్పు ఉండదు. స్పందనలో తేడా ఉండదు. మమకారానికి, మానవత్వానికి, మతానికి అజ్ఞాతంగా సమన్వయాన్ని ఊహించుకునే సహృదయుడతను. ప్రేమలో తప్ప మనుషులు పవిత్రులు కారని అతను ఎక్కడా చెప్పడు కానీ మువ్మాటికీ అట్లాగే జీవిస్తాడు.

✡

# ఆకుపచ్చ సంక్రాంతి

సంక్రాంతి వస్తుంది...పోతుంది. కానీ అంతకుముందు సంక్రాంతి అంటే నాక్కూడా ముగ్గులూ, కోడిపందాలు, పిండివంటలు గుర్తుకొచ్చేవి. ఇప్పుడు మాత్రం వేంపల్లె షరీఫ్ రాసిన 'ఆకు పచ్చ ముగ్గు' కథ గుర్తుకు వస్తుంది. ఈ కథతో కలిపి ఈ మధ్యే 'జుమ్మా' అనే ఓ కథల సంపుటిని వేశాడు ఈ యువకథకుడు.

ఇతని కథలు చాలావరకు ఉత్తమ పురుషలోనే ఉంటాయి. అవి మనం నడుస్తూ ఉంటే దారి పరుస్తున్నట్టుగా ఉంటాయి. ఇతని కథల్లోని పాత్రలు చాలా సహజంగా, అహంకార రహితంగా, తెచ్చి పెట్టుకున్నట్టుండే ఆదర్శాలకు చాలా దూరంగా ఉంటాయి. తెలుగిళ్లలో పెరిగి, తెలుగు స్కూల్లో చదివి, తెలుగు సంస్కృతిలో తిరిగి ముగ్గుల మీద ఇష్టం పెంచుకున్న ఓ ముస్లిం స్త్రీ కథ 'ఆకుపచ్చ ముగ్గు'

గ్రామీణ వాతావరణంలో మత సంబంధమైన విషయాలకు మితిమీరిన పట్టింపు ఉండదు. పట్టువిడుపులు ఉంటాయి. ఆ పట్టువిడుపుల నుంచి పుట్టిందే ఈ కథ. కథాంశం ముగ్గులే అయినా కథ రంజాన్ నుంచి మొదలై సంక్రాంతిలోకి ప్రవేశించి తిరిగి రంజాన్ దగ్గరికొచ్చి ముగుస్తుంది.

రంజాన్ ఎప్పుడన్నది టీవీల్లో చెప్పలేదు. రేపా ఎల్లుండా అన్నది నిర్ణయం కాలేదు. ఆకాశంలో నెలవంక కనిపించడాన్ని బట్టి అది నిర్ణయమవుతుంది. మిద్దె పైకెక్కి చూస్తాడు కథానాయకుడు. చుక్కలూ ఉండవు.చంద్రుడూ ఉండడు. పండగ ఎప్పుడో తేల్చుకోలేక కిందికి వచ్చి చూస్తే గోరింటాకు పెట్టడానికి అక్క కోన్‌తో సిద్ధంగా ఉంటుంది. ఇష్టం లేకున్నా అక్క చెప్పింది కాబట్టి కాదనలేక ఆమె ముందు చేయి చాచి కూచుంటాడు కథానాయకుడు. అక్క గోరింటాకు పెడుతుంటే అతను జ్ఞాపకాల్లోకి వెళ్తాడు.

ఆడపిల్లలందరికీ మతంతో సంబంధం లేకుండా గోరింటాకు పిచ్చి ఉంటుంది. కోన్లు రాకముందు అందరికీ పచ్చి గోరింటాకే గతి. ఆకు కోసుకొచ్చి రుబ్బుకుని పెట్టుకునేవాళ్లు. కథానాయకుడి అక్క కూడా ఇదే పనిచేస్తుంది. తెలిసినవాళ్ల ఇంటికెళ్లి గోరింటాకు తెచ్చి రుబ్బుతుంది. చాలా ఓపిగ్గా తెల్లవార్లు మేలుకోని .. ఇంట్లో ఒక్కొక్కరికీ గోరింటాకు పెడుతుంది. ఒకరికి వేసిన డిజైన్ మరొకరికి వేయకుండా అందరికీ డిజైన్లు..డిజైన్లుగా వేస్తుంది. కాసేపు జ్ఞాపకాల నుంచి తేరుకుని అక్క ముఖంలోకి చూస్తాడు కథానాయకుడు.

అప్పుడు అతని మనసులో మెదిలే భావాలను ఇలా వివరిస్తాడు రచయిత.

" ఈ అక్క అప్పటి అక్కకాదు. అప్పటి అక్క అప్పుడే చెట్టు నుంచి కోసుకొచ్చిన బత్తాయి పండులా వుండేది. లావు లావు బుగ్గలు. చలాకీ కళ్లు. ఎంత ముద్దుగా ఉండేదో. ఆ రూపు రేఖలేవీ ఇప్పుడు అక్కలో కనిపించడం లేదు. ముఖమంతా పీక్కుపోయింది."

అక్కలో ఆ మార్పునకు గల కారణాలను కూడా ఇలా వివరిస్తాడు.

"అక్కకి ముగ్గురు ఆడపిల్లలు. మొదటి పాప పుట్టినప్పుడు ఎంతో సంతోషంగా ఉన్నింది. రెండో పాప పుట్టినప్పుడు కొంచెం సంతోషంగా ఉన్నింది. మూడో సారి కూడా ఆడపాప పుట్టాక అక్క సంతోషమంటేనే మరిచిపోయింది"

మౌనంగా మార్పుల్ని గమనించి వివరించి చెబుతాడు తప్ప ఎలాంటి కామెంట్లు చేయడు రచయిత. చివరికి కథానాయకుడితో అక్కకు ఓ ప్రశ్న వేయిస్తాడు.

'అక్కా.. నీకు గోరింటాకు పెట్టడమంటే ఎందుకింత కాసే?"

దానికిఅక్క చెప్పే సమాధానంతో కథ సంక్రాంతి ముగ్గులవైపుకు మళ్లుతుంది.

"కాసా.. పాడా.. సిన్నప్పుడు నా తోడ్తా తిరుగుతాండే ఆడపిల్లోళ్లంతా ఇండ్లముందు ముగ్గులేసుకుంటా ఉండిరికదా..! నాక్కూడా ఎయ్యాలని ఉండేది.

నీకు తెలుసుగా..అమ్మ సంగతి ఎయ్యనిచ్చేదికాదు.. దాంతో ఆ పిచ్చిని ఇట్లా గోరింటాకులు పెట్టి తీర్చుకుంటాండా.."

అక్క చెప్పిన సమాధానం విని ఆశ్చర్యపోతాడు కథానాయకుడు.

"కరెక్టే కదా.. ముగ్గు ఇంటి ముందు వేస్తే తప్పు కానీ గోరింటాకుతో అరచేతిలో వేస్తే కాదు కదా. ఒక మతానికి మరో మతానికి మధ్య తేడా ఇంతేనా? ఈ మాత్రం దానికేనా ..ఇన్ని మత ఘర్షణలు జరుగుతుంటాయి..? " అని ఆలోచింప జేస్తాడు.

అయితే ఇవి కథానాయకుడి మనసులో మాటలే అయినా రచయిత మాటలు కూడా అని నా అనుమానం. అక్క మాటలతో ఆలోచనల్లో పడ్డ కథానాయకుడు అక్కకి సంక్రాంతికి ఉన్న సంబంధాన్ని కళ్లకు కట్టిస్తాడు.

కథానాయకుడి అక్క జీనత్ ముస్లిమైనప్పటికీ ముగ్గులంటే ఎంతో ఇష్టపడుతుంది. సంక్రాంతి వస్తే చాలు తన స్నేహితులు రాణి, సుబ్బమ్మ వాళ్ల ఇంటిముందుకెళ్లి వాలిపోతుంది. వాళ్ల ముగ్గుల్లో కలసిపోయి, వాళ్ల రంగుల్లో తడిసి పోయి, వాళ్ల గొబ్బెమ్మలతో మురిసిపోయి ఏ తెల్లవారుజామునో ఇంటికొస్తుంది.

జీనత్ కొంచెం పెద్దయ్యేంతవరకు ముగ్గులాటలు ఆడనిచ్చిన ఆమె తల్లి కొంచెం పెద్దయ్యాక మాత్రం అడ్డుకుంటుంది. "ఇది మన సంప్రదాయం కాదు" అని చెబుతుంది. కానీ ముగ్గుల పిచ్చిని చంపుకోలేని జీనత్ చాలా కష్టాలు పడుతుంది. చీకిచెట్టు పూతతో, నీటితో, ఇసుకతో రకరకాల వాటితో ముగ్గులేస్తుంది. అందరిళ్లముందు ముగ్గులేసే తాను, తన ఇంటి ముందు ఎందుకు ముగ్గులేయకూడదు?..అని బాధపడుతుంది. చివరికి నిమ్మకాయలు మాగ పెట్టే మందు పొడితో ముగ్గులేయబోయి ఆ మందు పొడి కళ్లలో పడి కంటి చూపుకు చేటు తెస్తుంది.

భగ్గుమంటారు ఇంట్లోవాళ్లు. "అయ్యో ఆడపిల్లే..కంటికేమైనా అయితే ఎవరు కట్టుకుంటారు..?"- ఒకటే గగ్గోలు. ఆస్పత్రికి పరుగులు. చివరికి డాక్టర్ ధైర్యం చెప్పి మందులు వేసి కంటి చూపుకు ప్రమాదం లేకుండా చేస్తాడు. అప్పటి నుంచి జీనత్ ముగ్గుల జోలికి వెళ్లదు..కానీ తన ఇష్టాన్ని ఇలా గోరింటాకు మీదికి మళ్లించుకుని అరచేతుల్లో ఆకుపచ్చ ముగ్గులు పండిస్తుంటుంది.

కథ స్థూలంగా ఇదే అయినా అందులోని గూడార్థం మాత్రం చాలా ఉంది. జీనత్ తమ్ముడు కథానాయకుడు హైదరాబాద్‌లో ఉన్న ప్రభావం వల్లనేమో చివర్లో అక్కకు ఓ ప్రశ్న వేస్తాడు.

“అక్కా.. నీ మాటలు విని, మెహిందీని ఇష్టపడే ముస్లిములంతా ఒకప్పుడు ముగ్గుల్ని ఇష్టపడినవాళ్లే అని ఎవరైనా అనుకుంటే అది మన మతాన్ని తక్కువ చేసుకున్నట్టు కాదా?”

అప్పుడు కూడా అక్క చాలా అభ్యుదయమైన భావాలతో సమాధానమిస్తుంది.

“అట్టెందుకైతాదిరా.. ఇబ్బుడు మనం పండగ చేసుకుంటాండాం. నువ్వు నీ స్నేహితులు సంటిగాడు.. ఆ శెట్టిగారి పిల్లోడి పేరేం పేరు.. ఆ.. లచ్చుమన్‌ని అన్నానికి పిలుచ్చావ్. వాళ్లొచ్చి తింటారు..తిని బావుండాదంటారు. అంత మాత్రానికే వాళ్లు వాళ్ల మతాన్ని తక్కువ చేసుకున్నట్టా..? కాదు కదా..వాళ్ల మతం వాళ్లదే. మన మతం మనదే. కాకపోతే ఒకరి మతాల్లోని కొన్ని విషయాలు మరొక మతంలోని వారికి నచ్చుతాయి..అంతే..” అంటుంది.

స్త్రీలు నేల మీద నిలబడి ఆలోచిస్తారు. ఆకాశంలోకి, ఆదర్శాల్లోకి ఎగిరే పురుషుల్ని కాళ్లు పట్టి లాగి భూమ్మీద నిలబడతారు. అక్క మాటలు ఈ కథలోని తమ్ముణ్నే కాదు ఈ సమాజంలోని ప్రతి ఒక్కరినీ ఆలోచింపజేస్తాయి.

కొన్ని అలవాట్లకు, కొన్ని అభిప్రాయాలకి, కొన్ని ఆలోచనలకి, కొన్ని ఇష్టాలకి మతాలు అడ్డురావు. మతాన్ని అర్థం చేసుకునే కోణం తెలుసుకుంటే జీవితాన్ని ఎంత ఇష్టంగా గడపొచ్చో ఈ కథ చెబుతుంది.

ముఖ్యంగా ఇప్పటి కాలమాన పరిస్థితులకు అత్యంత ఆవశ్యకమైన కథ ఇది. అందుకే సంక్రాంతి చిహ్నంగా ఈ కథ సాహితీలోకంలో మిగిలిపోనుంది.

*(సూర్య దినపత్రిక, సోమవారం 23, జనవరి 2012)*

# దేవుడి కథ

ప్రపంచమంతా రకరకాల మతాలు. దేవుళ్లు.

మతయుద్ధాలు జరుగుతూనే ఉన్నాయి. మనుషులు చస్తూనే ఉన్నారు. దేవుణ్ని నమ్మేవాళ్లు కొందరైతే నమ్మనివాళ్లు మరికొందరు. ఎవరు ఎలా కలగంటే అలా దేవుడు వాళ్లకు అనుకూలంగా కనిపిస్తాడంటా. అందుకే జార్జ్ బెర్నార్డ్ షా అంటాడు...'' ఇంగ్లీషు వాళ్లు దేవుణ్ని ఎప్పుడూ తమ వాడే అనుకుంటార''ని.

ఈ మధ్యే యువ రచయిత వేంపల్లె షరీఫ్ అచ్చువేసిన 'జుమ్మా'కథల పుస్తకంలో దేవుడి గురించి ఒక ఆసక్తికరమైన కథ ఉంది. అది చదవగానే ఎందుకనో కాసేపు సుదీర్ఘమైన ఆలోచనలో పడ్డాను. రచయిత ఆలోచన తప్పో రైటో కాసేపు తేల్చుకోలేకపోయాను. ఆ కథ పేరు ఏంటంటే 'తెలుగోళ్ల దేవుడు'.

మనుషులకు దేవుడి పిచ్చి ఎంత గా ఉంటుంది.. అది ఇతరులకు ఎంతగా ఇబ్బంది పెడుతుందో ఈ కథ వివరిస్తుంది. నేటి విద్యావ్యవస్థ జుట్టుపట్టుకుని ''నువ్వు ఎటువైపో తేల్చుకో..'' అని నిలదీస్తున్నట్టుగా ఉంటుంది.

గౌసియా తెలుగు స్కూల్లో చదువుకోలేకపోయింది. తన కూతురు మున్నీనైనా చదివిద్దాం అనుకుంది. భర్తను ఒప్పించి కూతుర్ని తెలుగు స్కూల్లో చేర్పించింది.

మున్నీ చురుకైంది. స్కూల్లో పరుగుపందెంలో ఫస్టు వచ్చింది. ప్రైజు కొట్టింది.

మున్నీ చదివే స్కూలు పేరు 'శ్రీ వేంకటేశ్వర విద్యామందిర్'.

పేరు ఏదైతే ఏముంది.. అన్ని పేర్లు ఒకటే అని నమ్ముతున్నప్పుడు.. ఇబ్బంది లేదు. అయితే స్కూలు డ్రస్సుకు వేసుకునే బెల్టుపై వేంకటేశ్వరుడి బొమ్మ ఉంది. అంతేకాదు ఐడెంటిటీ కార్డుపై కూడా దేవుని బొమ్మ ఉంది. అయితే ఏమవుతుంది.. అందుకే లైట్ తీసుకుంది.

కానీ మున్నీకి పరుగుపందెంలో ఫస్ట్ వచ్చినందుకు బహుమతిగా ఇచ్చిన వెండిబొమ్మపై కూడా తెలుగోళ్ల దేవుడే ఉన్నాడు. ఇక్కడే వచ్చింది చిక్కు. ఎవరైనా బహుమతి వస్తే ఏం చేస్తారు.. నలుగురికీ చూపించి ఆనందిస్తారు. నలుగురికీ కనిపించేలా ఇంట్లో గర్వంగా ఉంచుకోవాలని చూస్తారు. పైగా ఈ బహుమతి గౌసియాకు వచ్చి ఉంటే అది వేరే సంగతి. చిన్న పాపకు వచ్చిన బహుమతి. అప్పుడప్పుడే చదువుమీద ఆసక్తి పెంచుకుంటున్న చిట్టిపాపకు వచ్చిన మొట్టమొదటి బహుమతి. దాన్ని ఎట్లా ఇంట్లో ఏదో మూల దాచేయగలం? నలుగురికీ కనపడేలా ఇంట్లో పెడితే ఆ పాపకు మరింత ప్రోత్సాహంగా ఉంటుంది కదా? ఆ ప్రోత్సాహంతో మున్నీ మరిన్ని బహుమతులు గెలుస్తుంది కదా? అందరూ ఆ బహుమతి గురించి మాట్లాడుతుంటే ఆ పిల్లకి ఎంత ఆసక్తిగా ఉంటుంది...!

అందుకే అప్పటికీ ఏమీ పట్టించుకోని గౌసియా ఆ బొమ్మని టీవీస్టాండు మీద పెట్టింది. ఒకరిద్దరు ఇంటికొచ్చి "ఇదేంది.. తెలుగోళ్ల దేవుణ్ని పెట్టుకున్నారే.." అని అనడంతో ఆమెకు ఇబ్బంది ఎదురవుతుంది. అందరూ బహుమతి గురించి మాట్లాడి మున్నీ ప్రతిభను మెచ్చుకుంటారనుకుంటే ఆ బహుమతిపై ఉన్న దేవుడి బొమ్మ గురించి మాట్లాడటం మొదలుపెట్టారు. అంతేకాదు "సాయిబూలై ఉండి తెలుగోళ్ల దేవున్ని పెట్టుకున్నారే... దూదేకులోళ్లా.. ఏంది?" అని ఎగతాళి చేయడం మొదలుపెట్టారు. అలా వాళ్లు ఎగతాళి చేసేంతవరకు కూడా అది పరాయి మతానికి చెందిన దేవుడి ప్రతిమ అనే స్పృహ గౌసియాకు ఉండదు. ఇక ఆ స్పృహంటూ వచ్చాక ఆమెకు మనశ్శాంతి ఉండదు.

అదే స్కూల్లో జైతూన్‌బీ కూతురు రుబీనాకు కూడా పాట పాడినందుకు బహుమతి ఇస్తారు. అందులో కూడా ఈ దేవుని ఉంది. అయితే జైతూన్‌బీ, గౌసియా అంత ఆలోచించలేదు. ఆ బహుమతిని తీసుకెళ్లి టక్కున బీరువాలో పెట్టేసింది. ఆ విషయం గౌసియాకు తెలిసి ఆమె కూడా మున్నీకి వచ్చిన బహుమతిని తీసుకెళ్లి బాధగా బీరువాలో పెట్టేస్తుంది.

టీవీస్టాండుపై ఉండాల్సిన బొమ్మ కనిపించకపోయేసరికి భర్త చాన్ బాషా అడుగుతాడు "బొమ్మ ఏమైందని?"

అంతవరకు రకరకాల ఆలోచనల్తో ఉన్న గౌసియా సరసరా.. మనసులో బాధనంతా కక్కుతుంది.

" అందరూ కల్సి చదువుకునే స్కూళ్లకు దేవుళ్ల పేర్లు లేకుండా ఏ మామూలు పేర్లో పెట్టొచ్చు కదా.. మతాన్ని తెలిపే పేర్లెందుకు? చదువుకు లేని మతం.. ఆ చదువుచెప్పే స్కూళ్లకు ఎందుకుండాలి? పువ్వుల పేర్లు, చెట్ల పేర్లు, ప్రకృతి పేర్లు స్కూళ్లకు పెట్టి వాళ్లిచ్చే బెల్టుల్లో, స్కూలు డ్రెస్సుల్లో, బహుమతుల్లో అచ్చెయ్యొచ్చు కదా. ఎక్కడ చూసినా ఈ దేవుళ్ల గోల ఏంటి? "అని అడుగుతుంది. ఈ విషయంస్కూలు యాజమాన్యంతో మాట్లాడటానికి సిద్ధమవడంతో కథ ముగుస్తుంది.

ఇక్కడ ఎవరి మతాన్ని ద్వేషించడం లేదు. ఎవరి మతాన్ని వెనకేసుకుని రావడం లేదు. అసలు మతం ఎంతవరకు ఉండాలి..? ఎంతవరకు ఉండకూడదు.. దాని పరిధి ఎంత? అన్నదే ప్రశ్న.

పాఠశాలలు పబ్లిక్ ప్రాపర్టీ. అందరికీ చెందినవి. ఇందులో అన్ని కులాల వాళ్లు, మతాల వాళ్లు చదువుకుంటారు. నిషేధం లేదు. భాషకు తారతమ్యం లేదు. ఎవరు నేర్చుకుంటే వాళ్లకు వస్తుంది. మరి.. అలాంటప్పుడు మతాలు తెలిపే పేర్లు స్కూళ్లకు ఉండొచ్చా...? ఉన్నింది పో.. ఆ మతాల దేవుళ్ల బొమ్మలు పిల్లలకిచ్చే గిఫ్టుల్లో ఉండొచ్చా? - ఎంత పెద్ద ప్రశ్న? కథ చిన్నదే.. కానీ చదివాక దిమ్మ తిరుగుతుంది. షరీఫ్ మానవతా వాది. అది అతని కథల్లో అడుగడుగునా కనిపిస్తుంది. ఇక్కడ నా అనుభవం ఒకటి మీతో పంచుకోవాలి.

కొన్నాళ్ల క్రితం సిరియన్ క్రిస్టియన్లు మా ఇంటిపక్కన అద్దె కుండేవాళ్లు. ఒకరోజు వాళ్ల ఇంటికి వెళ్తే ఏసుక్రీస్తు, మేరీ మాతల పటాల పక్కన హిందూ దేవుళ్ల పటాలు కనిపించాయి. ఆశ్చర్యపోయి అడిగితే తరతరాలుగా మేము రెండు మతాల దేవుళ్లనీ పూజిస్తున్నామని అన్నారు. మరింత లోతుగా అడిగితే రెండు వేల ఏళ్ల నుంచి వాళ్లు ఈ సంప్రదాయాన్ని పాటిస్తున్నట్టు తెలిసింది. అప్పుడు నాకనిపించింది... ప్రతి ఆలయంలో అన్ని మతాల దేవుళ్ల ఆరాధన ఉంటే ఈ చంపుకోవడాలు, కొట్టుకోవడాలు ఉండవు కదా.. అని.

చిన్న వాడే కావొచ్చు కానీ గట్టి కథలు రాశాడు వేంపల్లె షరీఫ్. ఇతని కథలపై చర్చ జరగాల్సిన అవసరం ఉంది.

✡

# జీవితం గురించి తెలిసినవాడు

షరీఫ్‌కు జీవితం గురించి తెలుసు. జీవితం పట్ల, ప్రపంచం పట్ల అతనికి ఎలాంటి భ్రమలూ లేవు. అతను ప్రాక్టికల్ మనిషి కాడు. కానీ రియలిస్టు. తన ఊహకి, అంచనాలకి అందని వాటి జోలికిపోడు.

ఈ సమాజంలో ఉన్నతవర్గాల వాళ్లున్నారు. పెట్టుబడి దారులున్నారు. భూస్వాములున్నారు. వాళ్ల జీవన విధానం వాళ్లకుంది. వాటి గురించి మనం ఊహించగలం. కానీ షరీఫ్ కనీసం ఆ ఊహల జోలికి కూడా వెళ్లడు.

తాను పరిశీలించాల్సిన , ప్రదర్శించాల్సిన సమస్యలు సవాలక్ష ఉన్నాయి. వాటిలో కొన్నింటిని చూడగలిగితే చాలు. చూపగలిగితే చాలు. తనకు తెలిసిన ప్రపంచముంది. అందులో అనుబంధాలు ఉన్నాయి. కలతలున్నాయి. కన్నీళ్లున్నాయి. వాటి లోతుల్లోకి వెళ్తాడు. ఒక మనస్తత్వ శాస్త్రజ్ఞుడిలా, శిల్పిలా అక్కడి వాతావరణాన్ని సమగ్రంగా చిత్రించి మన ముందుంచుతాడు. స్వీయ అభిప్రాయాలతో, నిర్ణయాలతో, తీర్మానాలతో మనకు అడ్డు తగలడు. ఆదర్శాలతో ఊదరగొట్టడు.

ఉన్న పరిస్థితిని ఉదాత్తంగా చిత్రిస్తాడు. కుటుంబ అనుబంధాల్ని మానవ సంబంధాల్ని కళ్లకు కట్టిస్తాడు.

తల్లడిల్లే తల్లుల్ని, కుటుంబ పోషణ కోసం నిరంతరం శ్రమించే తండ్రుల్ని, తల్లిదండ్రుల పట్ల సానుభూతితో సంచలించే పసివాళ్లని మనకు చూపిస్తాడు. చిన్ని చిన్ని గొడవలు పడినా తెగేదాక లాగే వ్యక్తులెవరూ మనకు తారసపడరు. అందర్నీ కలిపి ఉంచే అతి పేదతనం మనల్ని నిరుత్తరుల్ని చేస్తుంది.

పరిష్కారం లేని సమస్యలు అతనికథల్లో సజీవంగా ఉంటాయి.

జీవితం సంక్షోభంలో ఉన్నప్పుడు భయాలు పెనవేస్తాయి. భయాలు అంచులు దాటినప్పుడు మనిషి నిస్సహాయంగా మిగుల్తాడు. వేటితోనో.. అనుబంధం పెంచుకుంటాడు. ఏవేవో అభిప్రాయాల్ని కల్పించుకుంటాడు. అవే తనని ఆదుకుంటాయని ఆశిస్తాడు. కానీ అవన్నీ ఎంత నిష్ఫలమైనవో షరీఫ్ 'అంజనం' కథలో ప్రదర్శిస్తాడు.

ఆమె పెద్ద కొడుకు కొన్నాళ్ల క్రితం ఇంటి నుంచి వెళ్లిపోయి తిరిగి రాడు. రెండో కొడుకు పేరు గౌస్. అన్న కోసం వెతికి వెతికి ఆశ వదులు కుంటాడు.

అంతలో ఒకరోజు వర్షం కురుస్తుంది. వర్షంలో తడిసిన ఒక నల్ల చుక్కల తెల్లపావురం ఇంట్లోకి వస్తుంది. ఎగరలేని స్థితిలో ఉంటుంది. గౌస్ తల్లి జమ్రూత్ దాన్ని పట్టుకుని ప్రేమగా పెంచుతుంది. సపర్యలు చేస్తుంది. ఇలా కాలం గడుస్తుంటే ఓరోజు ఆ వీధిలోనే ఉండే ఒకతను వచ్చి 'ఆ పావురం నాది..'అంటాడు. అదెలా తప్పిపోయిందో, ఏరోజు తప్పిపోయిందో కరెక్టుగా వివరించి చెప్పేసరికి జమ్రూత్‌కి ఆ పావురాన్ని ఇచ్చేయ్యక తప్పదు. ఈ నాలుగు రోజుల వ్యవధిలోనే ఆమెకు పావురంతో అనుబంధం పెరుగుతుంది. ఆ పావురం మీద ఆమె రకరకాల భ్రమలు పెంచుకుంటుంది.

ఆ పావురం రాక - తప్పిపోయిన తన కొడుకు రాకకు శకునమని ఆమె భావిస్తుంది. అందుకే ఆ పావురం మీద ఎనలేని అభిమానాన్ని పెంచుకుంటుంది. ఇప్పుడా పావురం తమదని వేరే అతను వచ్చి తీసుకెళ్తుండటంతో ఆమె తల్లడిల్లుతుంది. "అయితే ఇక తప్పిపోయిన తన బిడ్డరాడా..?" అనుకుని బాధపడుతుంది.

అదే విషయాన్ని రెండో కొడుకు గౌస్‌కు చెబుతుంది. "ఆ పావురం ఇంటికి వెతుక్కుంటూ వచ్చినట్టే తన బిడ్డ కూడా వస్తాడు అనుకున్నాను" అంటుంది. అప్పుడు తల్లి పరిస్థితి మీద గౌస్ జాలిపడతాడు

ఏ కథలోనూ తనకు తానే ముందుకొచ్చి మాట్లాడని రచయిత ఈ కథలో గౌస్ మాటల్లో కనిపిస్తాడు. ఆ క్షణంలో గౌస్ మానసిక స్థితిని ఇలా వివరిస్తాడు రచయిత

''ఆమె బిడ్డ కోసం అంజనాలు అడిగీ..అడిగీ.. వాటిని నమ్మి నమ్మీ.. తిరిగి..తిరిగీ.. చివరికి తానే సొంతంగా కొన్ని నమ్మకాలు ఏర్పరచుకునే స్థాయికి దిగజారింది. బిడ్డ మీది ప్రేమ ఆమెని ఎంత నిస్సహాయంగా మార్చేసిందో.. తల్చుకుంటూనే గౌస్‌కి గుండె తరుక్కుపోయింది'' అంటాడు.

ఈ మాటల్లో విచక్షణ తెలిసిన, జీవితం తెలిసిన షరీఫ్ ఉన్నాడు. మనుషులకు భయాలు ఎందుకు ఏర్పడుతాయో, నమ్మకాలు ఎందుకు ఏర్పడుతాయో అతనికి బాగా తెలుసు. అనుకున్నవి జరగలేదని కోట్లాది మంది నమ్మకాల చీకట్లో నలిగిపోవడం కూడా అతనికి తెలుసు. అందుకే మనుషుల నిస్సహాయత పట్ల అతను సానుభూతితో స్పందిస్తాడు. విశ్వాసాల బందీఖానాలో అతను కూడా బంధీ కాడు. అతను చైతన్యవంతుడు.

'ప్రతి మనిషీ పుట్టుకతో అజ్ఞానాన్ని వారసత్వంగా తెచ్చుకుంటాడు..'' అన్నాడు బుద్ధుడు. నిజమే కావొచ్చు. కానీ షరీఫ్ ఊహ తెలిసినప్పటి నుంచీ ఆ అజ్ఞానాన్ని వదిలించుకునే ప్రయత్నంలోనే ఉన్నాడు. మారడానికి మనిషి సిద్ధపడాలి. మార్పును ఆహ్వానించాలి. ఆ చైతన్యం ఉంటే మనిషి అనుక్షణం పరివర్తన చెందుతాడు. అలాంటి పరివర్తనకు అనుక్షణం సిద్ధమైనవాడు షరీఫ్. అతను పర్వతమెక్కుతాడు. అంచుకు చేరి కాంతిని చుంబిస్తాడు. అంతవరకు తన ప్రయాణాన్ని ఆపడు.

'మూన్ ఈజ్ నాట్ ఏ బేగింగ్, హి ఈజ్ బికమింగ్, లైఫ్ ఈజ్ ఏ ప్రోసెస్' అన్నాడు ఓషో. షరీఫ్ మారుతూ ఉంటాడు. తెలుసుకుంటూ ఉంటాడు. తెలుసు కుంటూనే ఉంటాడు.

✡

# కరెంటోళ్ల దాష్టికానికి నిలువుటద్దం

'జీపొచ్చింది' కథ చదివినప్పుడు ఇదేంటి కరెంటోళ్లు రైతులపట్ల ఇంత కక్ష పూరితంగా వ్యవహరిస్తారా? ఎంత ఘోరం అనిపించింది. కథా సమయాన్ని చూశాక అర్థమైంది అది టిడిపి ప్రభుత్వం నడుస్తున్నకాలమని. అవును కరెంటోళ్లు టిడిపి హయాంలో రైతులను పెట్టిన తిప్పలు అన్నీ ఇన్నీ కావు. రచయిత ఒకచోట కథలో కరెంటోళ్లను ఉద్దేశించి బ్రిటీషోళ్లు పన్ను వసూలు చేస్తున్నట్టుంది పరిస్థితి అంటాడు. పాలకులు ప్రపంచ మార్కెట్ మాయలో పడి రైతులను విస్మరించినప్పుడు ఉ ద్భవించిన కథ ఇది. 2003 ప్రాంతంలో ఆదివారం ఆంధ్రజ్యోతిలో అచ్చయ్యింది. కథాకాలాన్ని అర్థం చేసుకున్నాకే ఈ కథ నాకు బాగా అర్థమైంది.

వరుసగా తొమ్మిదేళ్ల పాటు కరువు. చుక్క నీరు లేదు. ఎక్కడ చూసినా ఎండిన పొలాలు. రైతు బాగోగులు పట్టించుకునే నాథుడు లేడు. రోళ్లు పగిలే ఎండలు. బావుల్లో అడుగంటుతున్న జలాలు. ఎన్ని ఇంచుల లోతులో బోర్లు వేసినా నీటి చెమ్మ తగలని సమయాలు. ఆరోజుల్లో, ఆ సమయాల్లో నీటికోసం బోరు వేసిన ఓ రైతు కన్నీటి కథ - జీపొచ్చింది.

వెంకట్రెడ్డికి మూడెకరాల పొలం ఉంటుంది. ఆ పొలం దగ్గరికి వెళ్తే రాలేము..

వస్తే వెళ్లలేం. అంత దూరం. అంతటి దూరాన ఉన్న పొలాన్ని కాలి నడకనే నెట్టుకొస్తున్నాడు వెంకట్రెడ్డి. వరుసగా వర్షాలు లేక పంటలు పండక కష్టాల్లో ఉన్న అతనికి ఇరుగుపొరుగు రైతులు ఒక ఆశ కలిగిస్తారు. బోరేస్తే నీటి కోసం మేఘాల వైపు ఎదురుచూడాల్సిన పని ఉండదని.. నీళ్లు పడితే నీ బతుకు పండుతుందని.

మనిషిని ఆశ - ఎంత దూరమైనా పరిగెత్తిస్తుంది. ఆశకి దప్పిక ఉండదు..ఆకలి ఉండదు. అలా పరిగెత్తించింది వెంకట్రెడ్డి చేత బోరు వేయిస్తుంది. ఆ బోరు వేయడానికి కూడా వెంకట్రెడ్డి ఎన్నెన్నో కష్టాలు పడాల్సి వస్తుంది. ఎక్కడెక్కడో అప్పులు చేయాల్సి వస్తుంది. రెండు వందల అడుగుల్లోపే పడాల్సిన నీళ్లు మూడు వందలు దాటినా పడవు. 'ఇంగెట్టరా..సామీ' అనుకుంటాడు వెంకట్రెడ్డి. చివరికి నీళ్లు పడతాయి. అవి ఎంత అంటే సంటిపిల్లాడి ఒంటేలు ధారంతా.

ఆ రోన్ని నీళ్లతో వెంకట్రెడ్డి ఏమి చేస్తాడు? ఎంతని పారగడతాడు? ఆ రోన్ని నీళ్లయినా ఉట్టినే పైకి వస్తాయా? మోటారు కావొద్దు.. మోటారు ఊరికనే ఆడుతుందా..దానికి కరెంటు కావొద్దు... కరెంటు ఊరికనే వస్తుందా.. గవర్నమెంటుకు డబ్బులు కట్టొద్దు.. ఇదీ కథ.

మోటారు బిగించడానికి, కరెంటోళ్లకు డబ్బు కట్టడానికి, స్టాటర్ పెట్టె కొనుక్కురావడానికి పడరాని పాట్లు పడి చివరికి ఇంట్లో తల్లి లాంటి గేదెను కూడా అమ్మేసి అన్నిటికీ సిద్ధపడతాడు వెంకట్రెడ్డి. ఎలాగోలాగ పాతాళంలోని ఒంటేలు ధారలాంటి నీటి చెమ్మని పైకి తెస్తాడు. దాంతోనే రోజంతా ఎండలో పడిగాపులు కాచి పొలానికి పారగొట్టడానికి పూనుకుంటాడు. కరెంటు వస్తూ ఉంటుంది.. పోతూఉ ంటుంది.

సరిగ్గా ఇలాంటప్పుడే జీపేసుకుని కరెంటోళ్లు చార్జిల వసూళ్లకోసం పొలాల్లో పడతారు. చార్జిలు కట్టని రైతుల స్టాటర్ పెట్టెలను లాక్కెళ్లడానికి సిద్ధమవుతారు. ఆ విషయం వెంకట్రెడ్డికి తెలియదు. వస్తూ పోతున్న కరెంటుతో విసిగిపోయి తెచ్చుకున్న అన్నం కూడా తినబుద్ధి కాక అంత దూరం నుంచి ఎండపొద్దున నడుచుకుంటూ ఊళ్లోకి వస్తాడు. సరిగ్గా ఇక ఇంటికెళ్తాడనగా.. ''ఓరే.. వెంకట్రెడ్డి..ఏందిరా ఇంగా ఈడనే ఉండావు.. పొలాల్లోకి కరెంటోళ్లు వెల్నారు.. ఉరికెత్తురా.. ఉరికి స్టాటరు పెట్టె దాసుకోపో..'' అని చెప్తారు ఊళ్లోవాళ్లు.

వెంకట్రెడ్డికి కాళ్లూ చేతులు ఆడవు. పరిగెడుతాడు.. ఒకవైపు అడుగులు ముందుకు పడుతుంటే కన్నీళ్లు చెంపల మీద కారుతుంటాయి. ఎంత పరిగెత్తితే మాత్రం వెంకట్రెడ్డి కరెంటోళ్ల జీపు కన్నా వేగంగా పరిగెత్తగలడా? తిండానికి తెచ్చుకున్న

అన్నం క్యారి కూడా ఎప్పుడో నేల కూలిపోతుంది. పొలాల్లో అడ్డంగా పరిగెడుతుంటే కళ్లముందే అతని కలల సౌధాలు కూలుతున్న దృశ్యాలు కదులుతుంటాయి. ఆ దృశ్యాలు ఒక వెంకట్రెడ్డికే కాదు కథలో లీనమైన మనకు కూడా స్పష్టంగా కనబడుతుంటాయి. చాలా శక్తివంతంగా రచయిత మలచిన కన్నీటి కావ్యం.. జీపొచ్చింది.

చివరికి ఏదైతే జరగకూడదని వెంకట్రెడ్డి అనుకుంటాడో..అదే జరుగుతుంది.. అతను వెళ్లేసరికే కరెంటోళ్లు పొలానికి చేరుకుంటారు. స్టాటరు పెట్టె విప్పదీస్తారు. "సార్..సార్.. పిల్లల గల్లోణ్ని.."అంటాడు వెంకట్రెడ్డి. వాళ్లు వినరు. తోసేస్తారు. మళ్లీ వెళ్తాడు వెంకట్రెడ్డి కరెంటోళ్ల కాళ్లకు చుట్టేసుకుంటాడు.

"మీరు స్టాటర్ పెట్టె ఎత్తుకుపోతే ఎల్టీన్ తాగాలి సార్" అంటాడు.

"అప్పులు" అని చెబుతాడు.

శక్తి కొద్ది ఏడ్చి వాళ్ల కాళ్లు తడుపుతాడు. అయినా వినరు. గట్టిగా తోస్తారు. అల్లంత దూరంలో పడ్డ వెంకట్రెడ్డి మళ్లీ లేవడు."స్టాటర్‌పెట్టెను తీసుకెళ్తున్న కరెంటోళ్ల జీపు వెంకట్రెడ్డి ప్రాణాలను తీసుకెళ్తున్న యముని వాహనంలా ఉంది" అనే వాక్యంతో కథ ముగుస్తుంది.

నిజంగా రైతు ఒక్కో సందర్భంలో ఎలా స్పందిస్తాడో.. ఎంతగా మదన పడతాడో.. ఈ కథలో కళ్లకు కట్టినట్టు చూడొచ్చు. వర్తమాన జీవిత పరిశీలనలో కూడా షరీఫ్ ముందుంటాడు. హైదరాబాద్‌లో బాంబు పేలుడు జరిగినప్పుడు రాసిన 'జుమ్మా' కథ కావొచ్చు. టిడిపి పాలనలో జరిగిన కరెంటు దౌర్జన్యం కావొచ్చు.. రచయిత షరీఫ్ ఎప్పటికప్పుడు ఒక కన్ను ఈ రాజ్యం మీద కూడా వేసి ఉంటాడు.

✡

# నిజమైన రాయలసీమ కథ

షరీఫ్ రాయలసీమ కష్టాలు కళ్లకు కట్టేకథలు కూడా రాశాడు. అవి చదివితే మన గుండె ఝల్లుమంటుంది. 'రజాక్ మియా సేద్యం' కథ అలాంటిదే.

రజాక్‌కు ఐదెకరాల మెట్ట పొలం ఉంది. దాంట్లో ఎన్నో ఏళ్ల నుంచి వేరుశెనగ పంట వేస్తున్నాడు. ఏ సంవత్సరమూ సరైన పంట చేతికి రాదు. అప్పులు పెరిగిపోతాయి. ఆ సంవత్సరం కూడా వర్షాలు లేవు. తన పొలాన్ని ఆనుకుని ఉన్న పొలం చలమాడ్డిది. అతని పొలం పచ్చగా ఉంటుంది. కారణం అతను భూస్వామి. అతనికి బోరింగు ఉంది. వాడిపోతున్న తన పొలానికి ఒక పూట ఆ బోరింగ్ నుంచి నీళ్లిస్తే తన బతుకూ బాగుపడుతుంది. రెడ్డి పొలానికి కాపలా ఉన్న అంజి సలహా మేరకు చలమాడ్డిని నీళ్లు అడుగుదామనుకుంటాడు రజాక్.

మరోవైపు ఇంట్లో బియ్యం నూకలు నిండుకున్నాయి. అవి కావాలంటే చలమారెడ్డి బావమరిది మధురెడ్డిని అడగాలి. మధురెడ్డి చెబితే శెట్టి నూకల బస్తా ఇస్తాడు. అప్పటికే ఆరకంగా మధురెడ్డికి రజాక్ ఎంతో అప్పుపడ్డాడు. వారం పది రోజులు మధురెడ్డి వెంటబడితే కానీ ఇంట్లోకి నూకలు రావు.

ఇలాంటి పరిస్థితుల్లో చలమారెడ్డి దగ్గరికి వెళ్లి నీళ్లు అడుగుతాడు.

"నేను నీళ్లిచ్చి నీకు పంట వచ్చినా, ఆ వచ్చిన పంట అమ్మితే నా బావమరిది అప్పు కూడా తీరదు. ఎందుకీ బాధ నీ పొలం నాకు అమ్మెయ్.."అంటాడు చలమాడ్డి.

రజాక్ గుండెల్లో రాయి పడుతుంది. దిగులుగా తిరిగి వస్తుంటే టాక్సీలోంచి ఎవరో స్త్రీ కిందపడిందని, ఆమె చావుబతుకుల్లో ఉంటే హాస్పిటల్‌లో చేర్చారని తెలుస్తుంది. ఈ బాధలో వెళ్లి చూడలేక ఇంటికి వస్తే ఆ స్త్రీ తన భార్యేనని రజాక్‌కు తెలియడంతో కథ ముగుస్తుంది.

ఇది అంతులేని కథ. భూస్వామికి ఎంతో భూమి ఉంటుంది కానీ అది అతనికి చాలదు. పేదవాడికి కొంత భూమి ఉంటుంది. అది అతని చేజారిపోతూ ఉంటుంది. చివరికి పేదవాడికి పేదతనమ్మొకటే మిగుల్తుంది.

మానవ మనస్తత్వాన్ని పరిశీలిస్తే మనలో జంతులక్షణాలే ఎక్కువ కనిపిస్తాయి. బలమైన జంతువులు, బలహీనమైన జంతువులపై అధికారం సంపాదించినట్టు బలమైన మనిషి మరో బలహీనమైన మనిషిపై అధికారం చెలాయిస్తూ ఉంటాడు. సింహం ఒక జంతువును చంపి తింటే..మళ్లీ దానికి ఆకలి వేయనంతవరకూ పక్కనించి జింక వెళ్లినా పట్టించుకోదు. కానీ మనిషి అలా కాదు. అతని కోరికలకు, కడుపు నిండటానికి సంబంధమే ఉండదు. వస్తువుల్ని, భూముల్ని సొంతం చేసుకోవడంలో అతను ఓ పైశాచిక ఆనందం పొందుతాడు.

కథ ఆరంభంలోనే రజాక్ పరిస్థితి నంతా మనకు కళ్లకు కట్టిస్తాడు రచయిత.

"మన్న మొలిచినట్టు లేదు..అప్పుడేసెనిక్కట్టె ఎండకు ఎర్రెగా మలమలా మాడిపోతాండాది. నిన్న తెచ్చినట్టు లేదు..అప్పుడే ఇంట్లో నూకల మూటె దినదినానికి కరిగిపోతాండాది. ఏందిరా ఈ బతుకు?" అంటూరజాక్ అనుకోవడంతో కథ మొదలవుతుంది.

యాభై ఏళ్ల క్రితం రాయలసీమలో ఎక్కడ మెట్టప్రాంతాల్లో చూసినా సజ్జలు, జొన్న చేలే కనిపించేవి. కందులు, మినుములు కనిపించేవి. చూస్తూ ఉండగానే క్రమేనా అవి కనుమరుగైపోయాయి. వాణిజ్య పంటలు రంగంలోకి వచ్చాయి. వర్షాలు లేకున్నా భూస్వాములు బోరింగుల ద్వారా పంటలు పండించుకునేవాళ్లు. వర్షాన్ని నమ్ముకున్న పేదలకు అంతా దైవాధీనం. ఫలితంగా చితికిపోవడం..పట్టణాలకు, నగరాలకు వలస పోవడం.

నగరాలు పెరుగుతూ పోవడమన్నది బలుపు కాదు, వాపు. ఇటీవల రాయలసీమలో వేరుసెనగ కూడా అదృశ్యమై మామిడి తోటలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. నీరు ఉన్నవాడికి నోరు ఉంటుంది. లేనివాడికి మౌనం ఉంటుంది.

దీపం కొడిగడుతున్నట్టు ఒక్కో పరిస్థితే రజాక్ మియాను ఎట్లా దిగజారుస్తుందో.. నిస్సహాయంగా అతనెట్లా మిగిలిపోయాడో షరీఫ్ ప్రతిభావంతంగా చిత్రించాడు. అతను రజాక్ కావొచ్చు, రామయ్య కావొచ్చు, రాయలసీమ వాడు కావొచ్చు, ఉత్తరాంధ్రవాడు కావొచ్చు. అతనికికులం లేదు, మతం లేదు. అతని కులం, మతం పేదతనం.

వ్యక్తి జీవన మూలాల్ని తడమకుండా వొట్టి ఆదర్శాలకోసం, సానుభూతి కోసం షరీఫ్ కథరాయడు. చదివే వాళ్లని భ్రమల్లో ముంచడానికి, వంచించడానికి కథరాయడు. ఒక సత్యాన్ని మనకు ప్రదర్శిస్తాడు. ఒక వాతావరణాన్ని ఆవిష్కరిస్తాడు. విస్తరించిన విశాల దృశ్యాన్ని మన ముందు పరుస్తాడు. మంచిచెడ్డలు మనకే వదిలేస్తాడు. పాత్రల పట్ల వకాల్తా పుచ్చుకోడు. పరిశీలకులు దాన్నే ప్రతిభ అంటారు. అట్లాంటి ప్రతిభతో కథా శిల్పాన్ని సొంతం చేసుకున్నాడు షరీఫ్.

✡

# తల్లిదండ్రుల బాధ్యతను తెలిపే కథ

''నా తిప్పలు నేను పడి, అప్పులు చేసి, చచ్చీ చెడి చదివిస్తే.. మా వాడు చదువుకోలేదు..''అని చాలామంది కంప్లయింట్ చేస్తుంటారు. అతను అన్ని కష్టాలు పడుతుంటే ఆ బిడ్డెలా చూస్తూ చదువుకోగలడు పాపం. తల్లిదండ్రుల కష్టాన్ని తల్లిదండ్రులకే వదిలేసి చెడు తిరుగుళ్లు తిరిగే వాళ్ల గురించి కాదు ఈ కథ. తిండికి లేకున్నా పిల్లలను చదివించుకునే 'పేద పెద్దల' కథ ఇది.

''అయ్యవారి చదువు'' అనే ఈ కథలో మాంచి నీతి ఉంది.

''నీ తిప్పలు నవ్వు పడు.. నీ కష్టాలు నువ్వుపడు.. తల్లివైనందుకు.. తండ్రివైనందుకు బిడ్డ బాగోగులు చూడ్డం నీ ధర్మం. ఏ బిడ్డ చదువుకోసమైతే నువ్వు కష్టపడుతున్నావో ఆ బిడ్డ చదువు పాడయ్యేలా నీ కష్టం కనబడనీకు.. ''అనేది కథ సారాంశం.

రైతు కుటుంబంలో పుట్టిన ఓ పేద అయ్యవారు తాను చదువుకోవడానికి పడ్డ కష్టాన్ని ఓ పిల్లాడికి వివరిస్తుంటాడు. శిల్పం రీత్యా కూడా ఈ కథ గొప్పది.

''చదువుకోవడమంటే నాకు భయమేసేది తెలుసా..?'' అనే వాక్యంతో కథ

మొదలవుతుంది.

ఆటోమెటిగ్గానే అవతలి కుర్రాడు "ఎందుకు?" అంటాడు.

ఇక ఆ అయ్యవారు తన గతం విప్పుతాడు.

అతను రైతు బిడ్డ.

వ్యవసాయ గిట్టుబాటు కానీ రోజులు.

ఒక పంట కోసం అప్పు.. మరో పంట కోసం అప్పు.. ఆ అప్పు కోసం మరో అప్పు..ఇంటి చుట్టూ అప్పులోళ్లు. అప్పులు చేసింది వాళ్ల నాన్ననా.. లేక ఈ పిల్లాడా.. అన్నట్టుంటుంది పరిస్థితి.

అతను ఇంటర్ చదువుతుంటాడు. పరీక్షలు కావడంతో చదువుకోవడానికి ఇంటి ముందు కూర్చుంటాడు. తండ్రి అప్పులోళ్ల దెబ్బకు భయపడి పొలానికెళ్లి దాక్కుంటాడు.

బిడ్డ ఎక్కడికీ వెళ్లలేడు. స్నేహితుల ఇళ్లకు కూడా వెళ్లలేడు. వెళ్లినా తల్లికి ఇంటి దగ్గర ఎవరూ తోడుఉండరు. అందుకే చిక్కుబడి పోతాడు. ఇంటి దగ్గరే ఉంటాడు. తండ్రి చేసిన అప్పులకు ఇలా సమాధానం చెబుతుంటాడు.

"నాయన లేడు కదా.. సేనికాడికిపోయినాడు.. వొచ్చానే.. చెప్తాలే..నువ్వు వొచ్చి పోయిన్నావని.."

కానీ వచ్చింది చుట్టాలు కాదు అప్పులోళ్లు..వాళ్లు ఊరికే ఉంటారా.. నసుగుతారు.. గొనుగుతారు.. కొందరు హద్దు దాటి తిడతారు.. అవన్నీ పిల్లాడు భరించలేడు. ఒక్క అక్షరం ముక్క పుస్తకంలో చదువుతాడో లేదో .. తనను డిస్టర్బ్ చేస్తూ ఇంటి ముందుకు ఎవడో ఒకడు అప్పులోడు..

అప్పులోడు వచ్చినప్పుడల్లా అతని ఏకాగ్రత పేలిపోతుంది.

అప్పులోళ్ల ఆలోచనలు చుట్టుముడుతాయి. ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. చదువుపై ధ్యానం కుదరకుండా చేస్తాయి. తొక్కలో చదువు మానేద్దాం అనుకుంటాడు. తండ్రికి సహాయ పడదామనుకుంటాడు. కానీ తన చదువుకోసం తండ్రి పడ్డ కష్టమంతా అతని కళ్లలో సుళ్లు తిరుగుతుంది.

తన ఇంటర్ ఫీజు కోసం పొలంలో వేయడానికి ఉంచిన ఎరువును అమ్మేస్తాడు వాళ్ల నాన్న. ఇక అంతకు మించిన ఆస్తేమీ అతని దగ్గర ఉండదు. రైతుగా ఉండుకుని దిబ్బలో ఎరువు అమ్ముకోవడమంటే ఎంతో నామోషి. ఆ నామోషి పని కూడా బిడ్డ కోసం చేస్తాడు. కానీ ఈ బిడ్డకు ఒక్కటే కోపం.

"తండ్రి అంటే తన తిప్పలు తాను పడి పరీక్షకు ఫీజు కట్టేసి ... చేతులు దులుపుకునేవాడు కాదు.. ఆ చదువుకు తగ్గ వాతావరణం ఇంట్లో కల్పించేవాడు.."అన్నది అతని ఆలోచన. కానీ ఈవిషయం ఎక్కడా రచయిత మనకు చెప్పడు. అదే అతని దగ్గరున్న టెక్నిక్. ఆ విషయాన్ని మనమే గ్రహించాలి. విజ్ఞతని ఉపయోగించాలి. ఏముంది ఇందులో.. అనుకుంటే ఏదీ లేదు. ఏదో ఉంది అనుకుంటేనే అంతా ఉంది.

ఒకవైపు నాన్న కష్టం.. మరోవైపు చదువు..ఉక్కిరిబిక్కిరవుతాడు అతను..

అక్షరం ముక్క చదవకుండానే సాయంత్రమవుతుంది. తండ్రి పొలం దగ్గరి నుంచి వస్తాడు.

వస్తూనే బండికి ఎద్దులు విప్పుతాడు. వాటికినీళ్లు తాపుతాడు. ఇంట్లో తొట్లో నీళ్లు అయిపోతే వెళ్లి తెస్తాడు. రాత్రవుతుంది. ఇంట్లో కరెంటు ఉండదు. బుడ్డి ముందు కూర్చుంటాడు. ఒక్కటేబుడ్డి. ఇంకో బుడ్డి తయారు చేసుకోవాలనుకుంటాడు. కుదర్దు. కుదిరినా కిరసనాయిలు ఉండదు. అమ్మ దగ్గర డబ్బులు అడిగితేఉండవు.

"నేన్నీకోసం లంజరికం చేయాల.. అబ్బడ్నొదిలి నన్ను లెక్క అడగనీకి సిగ్గన్నా ఉండాలా.. "అంటుంది తల్లి ఆక్రోశంగా.

అందరూ అన్నాలు తింటారు. పడుకోవడానికి సిద్ధమవుతారు. రాత్రి బుడ్డి దగ్గర కూర్చోని చదువుకుందామనుకుంటాడు ఆ పిల్లాడు. కానీ అతని కాలు తగిలి కిరసనాయిలు నేల పాలవుతుంది. తల్లి పిడిగుద్దులు గుద్దుతుంది. ఇక ఏమొహం పెట్టుకుని బుడ్డి దగ్గర కూర్చోని చదువుకుంటాడు. అందుకే ఏడుస్తాడు..అలా మంచం మీద వాల్తాడు. బాగా పొద్దు పోతుంది.

అప్పుడు తండ్రి అంటాడు..పక్కనే ఉన్న షఫీ వాళ్ల అంగడి దగ్గర కూర్చుని అప్పు అడిగిన రెడ్డితో..

"రెడ్డీ..నీకు తెలీందేముండాది సేన్లో ఏం పండకపోయినా.. ఆడికిపోయి తల దాసుకుంటాండా.. పరువు కాపాడుకుంటాండా.. ఏ పని లేకపోయినా ఊరికే ఎద్దల్ని మేపుకుని వచ్చాండా.. ఇంటికాడుంటే.. అప్పులోళ్లు అడగతారని దాంకోని తిరగతాండాననుకో.. సేనికోసమే అప్పు చేసినా.. ఇప్పుడు ఆ సేనికాడికే ఎళ్లి దాక్కుంటాండా..! ఆ సేనా? దూరం. ఆ సేనికాడికి ఎవురూరాలేరని ధైర్నం. ఇంకా ఆడిగ్గూడ అప్పులోళ్లు వచ్చినాపొద్దు.. ఆ కష్టాలేదోనేను పడుకుంటా..

కానీ రెడ్డీ.. సిన్నప్పుడు కలసి మెలసి తిరిగినోళ్లం. మా ఇంట్లో పండక్కి

మీరు.. మీ ఇంట్లో పండక్కి మేము తిన్నోళ్లం... నిను చూసి కూడా నేను దాక్కోలేను రెడ్డీ.. అందుకే చెప్తాండా.. నీ అప్పు అణా పైసాతో సహా తీరుస్తా.. కొన్నాళ్లు ఓపిక పట్టురెడ్డీ. ముందు నా బిడ్డ సదువు కాపాడుకోవాల. సేను ఎలాగో బొందుబోయింది వాడి సదువు మాత్రం బొందుబోకూడదు రెడ్డీ..

మా వోడా..బంగారం రెడ్డి.. మట్టిలో మాణిక్యం.. ఎన్ని పనులన్నా చెప్పు..లేదనకుండా జేచ్చాడు బిడ్డా.. మల్లా వాడి టయానికేమో వాడు సదువుకుని రెడీ అయిపోతాడు. మాకే ఉసిల్యాక వాడికి సరైన సౌకర్యాలు కల్పించలేక పోతాండాం.. రెడ్డీ.. లేకపోతే నా బిడ్డ స్టేటు ఫస్టు వస్తాడు.. స్టేటు ఫస్టు''

తన బిడ్డకు చదువుకునే వాతావరణాన్ని ఆ తండ్రి ఎందుకు కల్పించలేక పోతున్నాడో కథ చివర్లో అలా వివరించి వదిలేస్తాడు రచయిత.

ఇక కథలోని ఆ పిల్లాడితో పాటు మనకు కూడా దు:ఖం కట్టలు తెంచుకుంటుంది. తండ్రి మనసు తెలిసిన అతను ఎప్పుడెప్పుడు తెల్లవారు తుందా.. అని ఎదురు చూసి తొలి కిరణాలు భూమిని ఇంకా తాకుతుండగానే దొడ్లో కూర్చోని పూనకం వచ్చినోని మాదిరి చదువుతాడు.. తండ్రి కష్టాలను తల్చుకుని చదువుతాడు.

అంతే కథ అయిపోతుంది. ఇప్పుడు ఆ పిల్లవాడు 'అయ్యవారై (టీచర్)' కథ చెబుతున్నాడు కాబట్టి వింటున్న కుర్రాడు ''తర్వాత ఏమైంది'' అని అడగడు. ఇదీ అయ్యవారి చదువు కథ. ఇంత అందంగా.. నేత నేసినట్టుగా కథ చెప్పడం వేంపల్లె షరీఫ్‌కే చెల్లింది. ఈ కథ చదివిన ఎవరైనా.. తామెంత కష్టపడ్డా ఆ కష్టాల్ని బిడ్డలకు తెలియనివ్వమని ఒట్టేసుకుంటారు.

✡

# లేత మనసు

దారంటూ వెళ్తూ ఉంటాం. ఉన్నట్టుండి చల్లగాలి తగుల్తుంది. మనసంతా ఉల్లాసంగా మారుతుంది. చెట్లకింద నడుస్తూ ఉంటాం. ఒక చల్లని నీడ మనల్ని తాకి వెళ్తుంది. తన్మయంగా ఫీలవుతాం. ఎదురుగా తీగ నుంచి ఒక తియ్యని పువ్వు తీరుబడిగా చూస్తుంది. అలా చూసినప్పుడు ఆ సౌందర్యం మనల్ని చుట్టు ముడుతుంది.

పాతికేళ్లు దాటినా పల్చటి వెన్నెలలా, మృదువైన పరిమళంలా వేంపల్లె షరీఫ్ మనపై ఒక ఆహ్లాదాన్ని, స్వచ్ఛతని పుసిగొల్పుతాడు. అంతా యధార్థంగానేఉంటుంది. అంతా వాస్తవంగానే ఉంటుంది. కానీ ఆ హద్దుల్ని దాటిన దైవిక స్పర్శ ఏదో అతని మాటల్లో ఉంది. మానవత్వం ఆరని దీపంలా అతన్లో కాంతులు చిమ్ముతుంది.

ఒక స్నేహ వీచిక, ఒక దయార్ద్ర స్వరం, అనురాగ తరంగం అతని అక్షరాల్లో ఉంది. అరువు తెచ్చుకున్నవి కాక అక్షరాలు సహజాతి సహజంగా అతనికి అలంకారాలుగా కదుల్తాయి. కాంతి చిమ్ముతాయి. అతని కథలు చదువుతూ సన్నజాజుల వర్షంలో సన్నాయి రాగాల మధ్య సాగిపోతాం.

అతనితత్వంలో ప్రౌఢత్వం లేదు. తీవ్ర కాంక్షతో అల్లాడే యవ్వనం లేదు.

కౌమారంలోని అమాయకత్వం లేదు. వయసుతో సంబంధం లేని నిష్కాపట్యం, నిజాయితీ ఉన్నాయి. వయసుతో సంబంధం లేని, వయసు భరించలేని స్వచ్ఛత అతని మాటల్లో ఉంది. ప్రాచీనులు 'పూలు కడిగిన ముత్యం' అంటారే అట్లా మాలిన్యం మంటని మందహాసం అతని మాటల్లో ఉంది.

అనుభవాలు, అభిప్రాయాలు అందరికీ ఉంటాయి. కానీ దాదాపు అందరూ ఆనకట్టలు దాటి రారు. హద్దుల్ని అధిగమించరు. ఒక మిత్రుడన్నట్టు 'కొందరు నవ్వడానికి కూడా డబ్బడు'గుతారు.

విశాల మైదానంలో హాయిగా ఒక పసివాడు ఆడుకుంటూ ఉంటాడు. ఆనందంగా ఉంటాడు. తనకు కనుచూపు మేరలో కాయకష్టం చేసే తనవాళ్లని, తెలిసినవాళ్లని చూస్తూ ఉంటాడు. వాళ్ల కష్టం పట్ల పసివాడు స్పందిస్తాడు. తనకూ వాళ్లకూ మధ్య ఉన్న తరతమ భేదాన్ని, దూరాన్ని చూసి ఆశ్చర్యపోతాడు. అందరూ తనని ప్రేమగా చూడ్డం చూసి ఆర్ద్రంగా కదిలిపోతాడు. తన అనుభవాన్ని పూసగుచ్చినట్టు, పూలదండ అల్లినట్టు మనతో చెబుతాడు.

అతని కథల్లో అద్భుతాలు ఉండవు. కల్పనలు ఉండవు. ఆవేశాలు ఉండవు. లేత మనసులోని అలల్ని మనల్ని తాకేలా చేస్తాడు. కరుణాంతరంగంతో మనల్ని కన్నీళ్ల పర్యంతం చేస్తాడు. అనుభవాలతో బండబారడు. అనుభవాన్ని మనపైకి మచ్చిక చేసిన పక్షిలా వదులుతాడు.

అన్నిటికన్నా మనల్ని ఆశ్చర్యంలో ముంచెత్తేది అతని భాష. అతని భాషలో ఎంత వెతికి పట్టుకుందామన్నా ఒక కఠినమైన పదం కూడా కనిపించదు. అతను ఎంతగా చదువుకున్నా తన సుకుమారమైన భావాల్ని బాధపెట్టే పదాల్ని దగ్గరికి రానివ్వడు.

అతని రచనల ద్వారా మనకు తెలిసేది జీవితం అన్నది ఒక అపూర్వ వరమని, అద్భుతాలు జరక్కపోవడమే అర్థవంతమైన జీవితానికి అర్థమని తెలుస్తుంది. చిన్ని చిన్న సంఘటనలే అయినా అవన్నీ ఎంతో ఉన్నతంగా అనిపిస్తాయి.

భౌతికమైన సుఖం, స్థాయి, అధికారం, ఇవేవీ అంటని ఒక నిరాడంబర, నిర్మల, మధుర జీవనం అతని కథల్లో ఉంది. లేత పచ్చిక, హఠాత్తుగా ఎగిరే సీతాకోకచిలుక, ప్రేమ నిండిన చూపు, ఒక చిరునవ్వు ఇంతకు మించి జీవితానికిఏం కావాలి? సామాజిక సరిహద్దులు దాటిన సౌందర్యం అతనిలో ఉంది.

యూరోపియన్‌చిత్రకారుడు ఆంథోనీ వాన్‌డిక్ గురించి 'వయసు మించిన తెలివి తేటలున్నవాడు, పదహారేళ్ల వయసులోనే ఆయన తన చిత్రాన్ని వేశాడు.

అందులో దయ, నైపుణ్యం, మృదువైన సౌందర్యం కనిపిస్తాయి' అంటాడు.

షరీఫ్‌లో కూడా ఆ లక్షణాలున్నాయి. ఇవి ఎట్లా రూపొందాయి? అవి మనం పరిశోధన చేస్తే ఫలితముండదు. పువ్వు రహస్యం కనుక్కోవడానికి దాని రేకులు తుంచితే సౌందర్యం నాశనమవుతుంది. పువ్వుని చూడాలి. ఆనందించాలి. అంతే .. పువ్వు రహస్యంగానే ఉండాలి. షరీఫ్ ప్రతిభా రహస్యం కూడా అలాంటిదే.

పైగా దేశాల్ని, ప్రజల్ని ఉద్ధరించే సిద్ధాంతాలు మట్టికొట్టుకుపోయిన మంచికాలంలో ఈ రచయిత పుట్టాడు. ఎవరో కొంతమంది వృద్ధరచయితల ఆర్భాటాలు తప్ప ఎట్లాంటి సాహిత్య తరమూ లేని కాలంలో పుట్టాడు.

తనకు అనుభవాలున్నాయి. మృదువైన అలల్లా అవి ముసురుకుంటున్నాయి. ఊహ తెలిసినప్పటి నుంచి అందర్నీ ఆసక్తిగా పరిశీలించే ఈ బాలుడు యువకుడైనా తనతో పాటు బాల్యాన్ని తెచ్చుకున్నాడు. నిర్మలంగా జీవితాన్ని పరిశీలించే బాల్యం అందరికీ ఉండదు. ఆ రకంగా షరీఫ్ అదృష్టవంతుడు. పసితనంలోనే తన పరిశీలనను అక్షరాల్లోకి వొంపాలన్న ఆలోచన అతనికి కలగడం మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. తీగ సాగి పూలు పూచినట్టు అతని కథలు ఇప్పుడు గుబాళిస్తున్నాయి.

✡

# పసిప్రాణానికి అర్థం కాని పేదల బాధలు

అన్నిటికన్నా దారుణమైన బాధ అవసరాలు తీరకపోవడం.

''తినడానికి తిండి, కట్టడానికి బట్ట ఉంటే అంతకు మించిన ఐశ్వర్యం లేదన్నాడు'' ఒక జెన్ గురువు.

సెలవులు వస్తే పసిపిల్లలు అమ్మమ్మ వాళ్ల ఊరికో, నానమ్మ వాళ్ల ఊరికో వెళ్లాలనుకుంటారు. డబ్బున్నవాళ్లు ఏవో టూర్లు వెళ్తారు. ఎక్కడెక్కడో తిరుగుతారు. ఎంజాయ్ చేస్తారు. పేదవాళ్లు వాళ్ల పరిమితుల్లో ఆనందంగా ఉండటానికి ప్రయత్నిస్తారు.

తల్లిదండ్రులు కష్టపడుతున్నా పిల్లల్ని ప్రేమగా పెంచుతారు. పిల్లలకి అన్ని సుఖాలు అందివ్వలేకపోయినా ప్రేమగా చూసుకుంటారు.

'దస్తగిరి చెట్టు' కథలోని పిల్లాడికి వేసవి సెలవులు వచ్చాయి. మనసులో అమ్మమ్మ వాళ్ల వూరు మెదిలింది. అక్కడ గడిపిన ప్రతి అనుభవం గుర్తుకొచ్చింది. అక్కడ అష్ట ఐశ్వర్యాలు లేవు. అమ్మమ్మ ఇల్లు, బోద కొట్టం, జెండా మాను అరుగు, ఆ అరుగుపై ఆటలు.. మానుకు మొక్కులు. అంతే. అయినా అది అపూర్వంగా

పసివాడి మనసులో నాటుకు పోయింది. గొప్ప అనుభూతిని మిగిల్చింది. సెలవల్లో అక్కడికి వెళ్లాలని ప్రాణం గిలగిల్లాడింది.

పిల్లల ప్రపంచం చిన్నది. తమ పరిసరాల్లో పరిచయాల్లో ఉంటూ పసిపిల్లలు కొత్త పరిచయాల కోసం, కొత్త పరిసరాల కోసం తహతహలాడుతారు. ఎప్పుడూ అందుకనే ఎక్కడికో వెళ్లాలని ఆరాటపడుతుంటారు. సెలవుల కోసం ఎదురు చూస్తూ ఉంటారు. అన్ని అనుకూలాలు ఉన్న తల్లిదండ్రులు ముందుగానే సెలవుల్లోఎక్కడికి వెళ్లాలో ప్లాన్ చేస్తుంటారు.

షరీఫ్ కుటుంబంలో అంత సీను లేదు. తండ్రి పొలం పనికి వెళ్తాడు. తల్లి వంటిట్లో ఉంటుంది. షరీఫ్ స్కూలుకు వెళ్తాడు. అంతవరకు బాగానే ఉంది. కానీ సమస్యంతా సెలవలు వచ్చినప్పుడు ఉంటుంది. అంతవరకు ఇబ్బంది లేని రొటీన్‌కు అలవాటు పడిన పిల్లాడికి చిన్న భారం పడుతుంది. తండ్రి ఉదయాన్నే పొలం వెళ్తాడు. తల్లి మధ్యాహ్నం తల మాడిపోయే ఎండలో వేడివేడి అన్నం క్యారియర్ షరీఫ్‌కు ఇచ్చి దాదాపు కిలో మీటరుకు పైగా దూరంలో ఉన్న పొలంలో పనిచేసే తండ్రికి పంపుతుంది. వేడి వేడి క్యారియర్ పట్టుకుని చేతులు కందిపోతూ ఉంటే ఎండలో పడి పిల్లాడు వెళ్లాలి. దారిలో బండ్లు వెళ్తూ ఉంటే, ఎవరైనా జాలి పడితే బండి ఎక్కించుకుంటారు. లేకుంటే నడకే గతి. సాయంత్రం మళ్లీ తండ్రితో పాటు ఇంటికి రావడం వేడినీళ్ల స్నానం చేసి పడుకోవడం.

సెలవలు గడచిపోతున్నాయి. పది రోజులయిపోయాయి. ఇక ఉంటే వారం రోజులు ఉంటాయి. తల్లిని ఎన్నో సార్లు కన్నీళ్లతో బతిమాలాడు. ''అమ్మమ్మ వూరు వెళ్తానని'' వేడుకున్నాడు. కానీ తల్లి కాదంది. మారం చేస్తే బాదింది.

మరుసటి రోజు విశ్రాంతి తీసుకుంటున్న తల్లి దగ్గరికి చేరి కన్నీళ్లు పెట్టుకుంటే తల్లి కన్నీళ్లు తుడుస్తుంది. కొడుకును ఓదారుస్తూ ఆమె కూడా కన్నీళ్లు పెట్టుకుంటుంది. ఆ పిల్లాడ్ని ఆమె ఎందుకు అమ్మమ్మ ఇంటికి పంపదో చెబుతుంది. ఆ మాటలు విని మనం కూడా కన్నీళ్లపర్యంతమవుతాం.

''అమ్మమ్మోళ్లు పేదోళ్లు. వాళ్లకే తిండికి లేక పచ్చులు చస్తాంటే నీవు పోయి వోళ్ల పానాల మీద బడితే వోళ్లు నీకెక్కడ్నుంచి తీసుకొచ్చి పెడతారు చెప్పు? మేము సిన్నప్పుడే మా నాయన పీకల్దాక తాగి సచ్చిపోతే ముసల్ది..నానీమా ఒక్కతే రెక్కలు ముక్కలు చేసుకుని కట్టపడతాంది. నాతో పాటు పుట్టిన ఆడపిల్లోళ్లు ఇంకా ఇద్దరుండి సచ్చినారు గదా.. ఆ ఇంట్లో '' అంటుంది.

ఒక్కసారిగా అసలు విషయం మన కళ్లకు కడుతుంది. ఒక్క పసిప్రాణానికి

కూడా అంత అన్నం పెట్టలేని దీన స్థితిని చూసి మనకు దిగులేస్తుంది. పెద్దవాళ్లు సమస్యను అర్థం చేసుకుంటారు. పసివాడికి పూర్తిగా అర్థం కావు. తన అమ్మమ్మవాళ్ల దగ్గర డబ్బు లేదన్న సంగతి మాత్రం ఆ పిల్లాడికి తెలిసింది.

అందుకని దేవున్ని 'యా అల్లా.. మా అమ్మమ్మోళ్లు.. బీదోళ్లనే గదా.. అమ్మీ నన్ను ఆడికి పంపనంటాంది. మా అమ్మమ్మోళ్లకు దండిగా  లెక్క ఇవ్వు సామీ. అలాగే మా నాయనోళ్లకు కూడా దండిగా ఇవ్వు దంద్రీ.. అట్ట జేస్తే పెతి సెలవులకి నేను మా నానీమా వాళ్ల ఊరికి వెళ్లొచ్చు దేవుడా..'' అని ప్రార్థించాడు.

దేవుడు ఆ పిల్లాడి కుటుంబానికి అతని అమ్మమ్మోళ్లకు సంపదలిస్తాడో లేదో తెలీదు కానీ రచయిత షరీఫ్‌కి మాత్రం అందరిపట్లా అంతులేని ప్రేమను ఇచ్చాడు. ఎటు చూసినా ఎడారిలా విస్తరించిన విషాదంలో, దైన్యంలో అతన్ని సజీవంగా నిలిపింది ప్రేమ మాత్రమే. అందరికీ అతని పట్ల ఉన్న ప్రేమ, అందరి పట్లా అతనికి ఉన్న అనురాగం అతన్ని సజీవంగా, నిత్య చైతన్యంతో నిలిపాయి.

✡

# పలక లేని జీవితం

ఆకాశంలో మేఘాలు సాగుతూ ఉంటాయి. కానీ అవి అందవు. ఆగవు. ఆకాశాన్ని తాకే కొండలుంటాయి. పచ్చగానే ఉంటాయి. కానీ అవి ఆదుకోవు. జీవితం కూడా అంతే. అంతా బాగానే ఉన్నట్టు వుంటుంది. కానీ తినడానికి తిండి మాత్రం ఉండదు.

మారుమూల గ్రామాల్లో, మెట్ట ప్రాంతాల్లో కూలీ నాలీ దొరకని చోట నిరుపేదలు ఎలా బతుకుతున్నారో, ఏం తింటున్నారో మనకు అర్థం కాదు. అక్కడి ప్రజలకు ఆశలుండవు. అత్యాశలు ఉండవు. అవసరాలే వాళ్లకు అత్యాశలై భయపెడుతూ ఉంటాయి.

ఒక రూపాయి చేసే కోడిపిల్ల, ఒక రూపాయి కిరోసిన్ ఉన్న దీపం బుడ్డి, సెలవుల్లో అమ్మమ్మ వాళ్ల ఊరికి వెళ్లాలన్న ఆశ. ఇవన్నీ చిన్న కోరికలే. కానీ షరీఫ్ కథల్లోని పిల్లలకు మాత్రం నెరవేరని కలలు.

మనం చదివితే ఆశ్చర్యపోతాం. 'అవునా..?' అనుకుంటాం. కానీ ఇవి నిజాలు, పచ్చి నిజాలు. అలాంటి ఓ నిజాన్ని చెప్పే కథే పలక- పండగ.

ఆ ఊళ్లో స్కూలు ఉంటుంది. అది ఒక రకమైన ప్రయివేటు స్కూలు.

జహేర తన కొడుకుని ఆ స్కూలుకు పంపుతుంది. రెండు మూడు నెలలు గడిచాక, తన కొడుక్కి నాలుగు అక్షరాలు వచ్చాక అప్పుడు డబ్బిస్తానని పంతులుతో చెబుతుంది.

ఆమె కొడుకు పేరు మదారు. వాడు ఒకరోజు వంట చేస్తున్న తల్లి ముందు దిగాలుగా కూర్చుంటాడు. జహేరా పొయ్యి మీద అన్నం పెట్టి చింత పులుసు చేత్తో పిసుకుతూ అలిగిన కొడుకు కేసి చూసి విషయమడుగుతుంది.

అప్పుడు వాడు "పలక కావాలి" అంటాడు.

అంతవరకు జహేరా వాడికి పలక కూడా ఇప్పించలేదు. పక్క పిల్లోళ్లు రాసుకుంటూ ఉంటే చూసి నాలుగు ముక్కలు నేర్చుకుంటాడని ఆమె ఆశపడింది. పైగా పలక కొనడానికి డబ్బులు కావాలి? అవి ఎక్కడ్నుంచి వస్తాయి..?

అసలే వినాయక చవితి వస్తోంది. వినాయచవితి అంటే పలక పండగ. పిల్లలు పలకల్లో ముగ్గులు వేసుకుని రావాలి.

అందుకే మదారు పలక డిమాండ్ చేశాడు. ఏమి చేయాలో తోచక ఆమె ఓ రెండు మూడు గంటల పాటు తెలిసిన వాళ్లందరి ఇండ్లూ తిరుగుతుంది. చివరికి పాతసామన్లు అమ్ముకునే ఓ ఇంట్లో పాత రేకు పలక ఒకటి ఉంటే తీసుకొచ్చి మదారుకిస్తుంది.

ఆ పలక రాయదు. పలక దొరికిన సంతోషంలో స్కూలుకెళ్లిన మదారుకు ఆ విషయం తెలుస్తుంది. నొచ్చుకుంటాడు. ఏడుస్తూ ఇంటికొచ్చి ఆ పలకను తల్లి ముఖం మీదికి విసిరికొడతాడు. ముక్కుపగిలి ఆమెకు రక్తం కారుతుంది. దాంతో ఆమె వాడి వీపు వాయగొడుతుంది.

ఆ కథను అలా దు:ఖాంతం చేయడు షరీఫ్.

అలా ఏడుస్తూ పడుకున్న మదారుకు ఆ రాత్రి ఓ అందమైన కల వస్తుంది. ఆ కల్లో వాళ్ల నాయన మాబ్బాష తాగకుండా ఇంటికొస్తాడు. ఏడుస్తున్న మదారును 'ఎందుకురా.. ఏడుస్తున్నావు'అని దగ్గరకు తీసుకుంటాడు. మదారు విషయం చెప్పగానే వాణ్ని కొట్టినందుకు తల్లి మీద కసురుకుంటాడు. వేలు పట్టుకుని తీసుకుపోయి బంపరంగట్లో కొత్త పలక తీయిస్తాడు. తెల్లారుతుంది. బళ్లో వినాయకుని విగ్రహం ముందు కొత్త పలకతో మదారు చిందులు వేస్తాడు.

కథను అలా ముగిస్తాడు షరీఫ్. ఆ ముగించిన తీరు మనల్ని కదిలిస్తుంది. కన్నీళ్లు తెప్పిస్తుంది. 'చివరికి పలక కొనడం కూడా ఓ కలగా మిగిపోవాల్నా?' అని మనల్ని మనం ప్రశ్నించుకుంటాం.

'కొన్ని చోట్ల జీవితాలు మరీ యింత దీనంగా, దయనీయంగా ఎందు కున్నాయా?' అని ఆలోచిస్తాం.

పేదతనం గురించి మనం విని ఉంటాం. కష్టాల గురించి మనం చదివి ఉంటాం. కానీ ఊహకే అందని దారిద్ర్యాన్ని షరీఫ్ ఇక్కడ ఆవిష్కరిస్తాడు. కానీ ఇవి పచ్చి నిజాలు.

ఇలాంటి నిస్సహాయమైన జీవితాల్ని చూసినప్పుడు 'నిజంగా ఈ జీవితానికి అర్థముందా?'' అనిపిస్తుంది.

'దేవుడు దయామయుడు' అంటారు కదా.. ఆ విషయం గురించి చెబుతూ.. ''ఇట్లాంటి ప్రపంచాన్ని పుట్టించిన వాణ్ని దేవుడు అనడానికి మీకు మనసెట్లా ఒప్పుతుంది..'' అంటాడు ఓషో.

షరీఫ్ కథల్లో దయనీయ జీవితాలకు ఎవర్నీ కారణాలుగా చూపడు. నిందించడు. సమస్యని సమస్యలా చెప్పేసి వదిలేస్తాడంతే. ఎవర్నయినా నిందించాలనుకుంటే అతని పాఠకుల ఇష్టం. వారి విజ్ఞత.

✡

# మెత్తటి రత్నం

చిలుకూరు నారాయణరావు గారు రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారి గురించి మనోహరమైన పద్యం చెప్పారు.

'రాళ్ల సీమలోని రాళ్లెన్ని పుట్టెనో

రాళ్లలోన వజ్జరాలు పుట్టె

వజ్జరాలలోన వలపెట్లు పుట్టెరా

రాళ్లపల్లి కృష్ణరాయశర్మ.

రాళ్లపల్లి వారు హాలుని 'గాథా సప్తశతి'ని తెలుగు చేశారు. అందులోని సహజ శృంగార పద్యాల ఆవిష్కరణతో సాహిత్య ప్రియులకు అహ్లాదం కలిగించారు. ఆ సందర్భంగా అభినందనగా చిలుకూరు వారు ఈ పద్య ంచెప్పారు.

రాయలసీమలో లెక్కలేనన్నీ రాళ్లున్నాయి. ఎక్కడ పడితే అక్కడ రాళ్లు కనిపిస్తాయి. ఆ రాళ్ల నుంచే ఎప్పుడైనా వజ్రాలు పుడతాయి. అంతేకానీ ఆ వజ్రాలలో వలపు పుట్టదు కానీ రాయలసీమలో పుట్టిన రత్నంలాంటి రాళ్లపల్లిలో వలపు పుట్టడం ఆశ్చర్యం అన్నారు.

షరీఫ్ మెత్తటి వజ్రం.. అతని కథల్లాగే. అతని కథలు అతి సాధారణంగా ఉంటాయి. అసలు వాటిని కథావస్తువులుగా తీసుకోవచ్చా.. అని అనుమానం కూడా కలిగిస్తాయి. పూలను చూడండి.. వెలిగించిన దీపాలను చూడండి.. అప్పుడే ఆకాశంలోకి వచ్చిన నక్షత్రాలను చూడండి.. పసిపాప బోసినవ్వుని చూడండి.. మనం చూస్తాం.. ఆనందిస్తాం.. అంతలోనే మర్చిపోతాం. కానీ షరీఫ్ వాటిల్లో తన కథా వస్తువులను చూస్తాడు. ఆ వస్తువుల్లోనే ఒక సుకుమారమైన కన్నీటి కదలికను, ఆనంద భాష్పాన్ని వెతుకుతాడు.

రాయలసీమ రచయితల గురించి తెలుగు కథల్ని బాగా అధ్యయనం చేసిన ఒక వ్యక్తి నాతో కొన్ని స్వీపింగ్ కామెంట్స్ చేశాడు. అతను పత్రికలకు రాసేవాడు కాదు. రాయడానికి చదివేవాడు కాదు. చదవడానికి మాత్రమే చదివేవాడు. అతను అన్న మాటలు వింటే రాయలసీమ రచయితలు గింజుకుంటారు.

అతను రాయలసీమలో కథకులు లేరన్నాడు. అదేంటి..అని అడిగితే..

''అవును..రాయలసీమలో రాళ్లలాంటి రచయితలే ఉన్నారు. వాళ్లలో హృదయ స్పందన ఉండదు. కొని తెచ్చుకున్నట్టుంటాయి వాళ్ల కథలూ, కథనాలు. బండల్లాంటి వాళ్లు. కావాల్సినన్ని ప్రలోభాలకు లోనవుతారు. లెక్కలేనన్ని సాహిత్య ఫాక్ష్యనిజాలకు పాల్పడుతారు. ప్రచార వేటలో ఉంటారు'' అంటూ ఏవేవో అన్నాడు.

నేను కథకుణ్ని కాకపోయినా రచయితనే గనుక బాధేసింది.

అతను కొనసాగిస్తూ ''రాయలసీమలో కథకులు లేరు.. విమర్శకులు మాత్రం ఉన్నారు. కథకుల్లో లేని నిజాయితి విమర్శకుల్లో ఉంది. వాళ్లు నికార్సయిన వాళ్లు.'' అన్నాడు.

సౌకుమార్యం, సౌందర్య లక్షణం లేనిదేసాహిత్య కారుడు కాలేడు. కొంతమంది కథకులు కొని తెచ్చుకుని, పనిగట్టుకుని చేసిన రచనలే అతను ఆ మాటలనడానికి కారణమని తర్వాత తెలిసింది.

షరీఫ్ చాలా పరిమితుల్ని, హద్దుల్ని అధిగమించినవాడు. అతనిలో వస్తు వైవిధ్యముంది. అతను రాయలసీమ రచయిత కాడు. మైనార్టీ రచయితగా అతనిపై ముద్ర వేయడానికి వీలుపడదు. అతను తెలుగు రచయిత. భారతీయ పేద గ్రామీణ జీవితాన్ని ఆవిష్కరించే రచయిత.

'జుమ్మా' కథల కథల పుస్తకానికి ముందు మాటలు రాసిన రచయితలు కేతు విశ్వనాథరెడ్డి, దాదాహయాత్‌లు అతన్ని రాయలసీమ హద్దుల నుంచీ, మైనార్టీ అద్దాల నుంచీ చూడడానికి ప్రయత్నించి వాటి పరిమితులకు లొంగడని

చేతులెత్తేశారు.

షరీఫ్ చల్లగాలి వంటివాడు. అణువణువు సహజత్వం నిండిన వాడు. అసహజంగా ఉండటానికి అలవాటు పడిన వాళ్లకు అతను అర్థం కాడు.

'రూపాయి కోడిపిల్ల' అనే ఒక కథరాశాడు వేంపల్లె షరీఫ్.

అతని కథలన్నీ మనసును తాకిన చిన్ని చిన్ని సన్నివేశాలు. సామాజిక, చారిత్రక వంటి పెద్ద పెద్ద లోకోద్ధారక కథలు అతనికి తెలీవు.

అతనికి పువ్వులా కదిలే కోడిపిల్లలతో ఆడుకోవడం తెలుసు. జీవితంలోకి ఆ కోడిపిల్లలు పువ్వుల్లా రంగ ప్రవేశం చేస్తాయి. నిశ్శబ్దంగా నిష్క్రమిస్తాయి. ఆ అనుభవం చాలు అతనికి కథ రాయడానికి.

కోడి పిల్లలకు రకరకాల రంగులు వేసి అన్నిట్నీ బుట్టలో పెట్టుకుని 'రూపాయికి ఒకటి' అంటూ అమ్ముకుంటూ ఒకతను గ్రామానికి వస్తాడు. అంజద్ తోటి స్నేహితుల్తో ఆటాపాటా మానేసి వాటిని చూడ్డానికి పరిగెడతాడు. ఆకాశంలో నక్షత్రాల్లా మిలమిల మెరిసే కోడిపిల్లలంటే అతనికి ప్రాణం. అందుకే ఇంట్లో పోట్లాడి రెండు కోడిపిల్లల్ని కొని పెంచుకుంటాడు. కొన్నాళ్లకు ఒకదాన్ని గద్ద తన్నుకుపోతుంది. ఇంకొక్కటి ఆ దిగుల్తో చనిపోతుంది.

మళ్లీ అతనికి రూపాయి కోడిపిల్లల మీద మనసు పుడుతుంది. అప్పుడు కూడా తల్లిని ఒప్పించి రెండు కొంటాడు. ప్రేమగా పెంచుకుంటాడు. స్కూలు నుంచీ వచ్చాక వాటితో ఆడుకుంటూఉంటాడు. ఒక రోజు ఒక కోడిపిల్ల కనిపించదు. ఆందోళన చెందుతాడు. తల్లికి చెబుతాడు. తల్లితో కలసి కోడిపిల్లను తప్పిపోయిన చంటిపిల్లాణ్ని వెతికినట్టు వెతుకుతాడు. కానీ లాభం ఉండదు. కానీ మునుపటిలా రెండో కోడిపిల్ల కూడా దిగులుతో చనిపోదు. దాని ఆయుస్సును కూడా పోసుకుని పెద్దగా పెరుగుతుంది. కోడిపిల్ల కాస్తా కోడిగా మారి కండపట్టి బలంగా తయారవుతుంది. దాన్ని వండుకుని తిందామని తండ్రి అంటాడు. అంజద్ పసిమనసు అందుకు ఒప్పుకోదు. అతను ప్రతిఘటిస్తాడు. కానీ ఇంతగా ప్రేమ పెట్టి పెంచుకున్న కోడి ఓరోజు జీపు కింద పడుతుంది. కొనూపిరితో కొట్టుకుంటుంది. అది చూసి తండ్రి మండుతాడు. కోడిని ఎటూకాకుండా చేసినందుకు జుట్టు పట్టుకుని కొడతాడు. గబగబా జేబులో ంచి చిల్లర తీసిచ్చి వెళ్లి కొనూపిరితో ఉన్న కోణ్ని కోయించుకురమ్మని ఆజ్ఞాపిస్తాడు.

అప్పుడు చూడాలి.. అంజద్ స్థితి. జీపు కింద పడింది కోడా.. ఆ పిల్లాడి హృదయమా అన్నది ఒక పట్టాన తేల్చుకోలేము. తన అపూర్వ కథనంతో కథలో

మనల్ని లీనం చేస్తాడు షరీఫ్. తనకే తెలియని ఎన్నో విషయాల్ని కథ ద్వారా అందించడం షరీఫ్ నేర్చిన కళ.

మనం ఇష్టపడేవి, మనసు పడేవి, మన ఆనందంతో ముడిపడేవి మనకు చేజారిపోతాయి. మనం నిస్సహాయంగా మిగిలిపోతాం. కన్నీళ్లపర్యంతమవుతాం. మళ్లీ కన్నీళ్లు తుడుచుకుని కాలగమనంలో సాగిపోతాం. కానీ ఆ మృదువైన జ్ఞాపకాలు జీవితాంతం మనతో ఉంటాయి. మధురంగా  గుర్తొస్తాయి. ఆ గుర్తుల్ని పదిలంగా దాచుకున్నవాడే మనిషి.

ఎప్పుడైనా ఎక్కడైనా షరీఫ్ కనిపిస్తే అతనికళ్లలోకి చూడండి. హృదయ పూర్వకంగా నవ్వండి. నవ్వి వెళ్లిపోండి చాలు. అతను మిమ్మల్ని హృదయంలో ముద్రించుకుంటాడు. ఎప్పటికీ మీ చిర్నవ్వును మరచిపోడు.

✡

# లోకమంతా పరదాలే

'ప్రపంచీకరణలో నాశనమయ్యేది పేదరికం కాదు పేదలు' అన్నాడొక ప్రముఖుడు. అది వాస్తవం. నగరంలో ఉన్నవాళ్లకి తెలియని అనేక పరిస్థితులు గ్రామాల్లో ఉంటాయి. గ్రామీణవాతావరణంలో ఎక్కువగా దారిద్ర్యం ఉంటుంది. ఎక్కడైతే పేదరికం ఉంటుందో అక్కడ పట్టింపులకు, అహాలకు అవకాశం ఉండదు. పేదరికం మనిషికి సహనం నేర్పుతుంది.

షరీఫ్ 'పర్దా' అనే కథ రాశాడు. పర్దా అనేది ఒక మతానికి సంబంధించిన విషయం కాదని, అది మనుషుల మధ్య, మనసుల మధ్య అంతరాల్ని ఆవిష్కరించేదని ఈ కథలో అతను అపూర్వంగా చెబుతాడు.

ముప్పయ్యేళ్ల క్రితం గ్రామీణ జీవితం తెలిసిన వాళ్లకు మనుషుల మధ్య ప్రేమలు అర్థమవుతాయి. కులాల పేర, మతాల పేర పల్లెలుంటాయి. కమ్మపల్లి, వడ్డెపల్లి, తురక పల్లి వగైరా వగైరాలుంటాయి. పెట్టుబడి దారులు, భూస్వాములు, దోపిడీ వగైరా పెద్ద మాటలకు చాలా గ్రామాలు దూరంగా ఉంటాయి. అక్కడ దారిద్ర్యమే అన్నిటికన్నా గొప్ప భూస్వామి. ఏదో ఒకపని చేసుకుంటూ జనం నాలుగు మెతుకులు తిని కాలం వెళ్లదీస్తుంటారు. అక్కడ హిందూ, ముస్లిం అంటూ తేడాలుండవు. మతం కన్నా మమతే గొప్పగా ఉంటుంది. అందుకే కొట్లాడుకోవడాలు

ఉండవు. అవసరాన్ని మించిన ఐశ్వర్యం ఎంత ఆటవికమో ప్రశాంత జీవితానికి పేదరికం కూడా అంతే వరం. ఉన్నదాంతో సంతృప్తి పడితే అంతకుమించిన సుఖం ఉండదు.

గ్రామీణ జీవితంలో స్వేచ్ఛ అన్నది మౌలిక లక్షణం. ఎట్లాంటి నిర్బంధాలు లేని, కల్లా కపటం లేని, అత్యాశ లేని గ్రామాలు ఇప్పుడున్నాయా అంటే లేవు కానీ అట్లాంటి గ్రామాల పునాదుల్నించీ వచ్చిన ఒక 'జేజి' మాత్రం మనల్ని 'పర్దా' కథలో పలకరిస్తుంది. ఆకర్షిస్తుంది.

ఈ కథలో ఐదేళ్లవాడో, పదేళ్లవాడో పిల్లాడు ఉంటాడు. కథ చెబుతాడు. కథలోకి రాడు. సత్యంలా, సాక్షిలా ఉంటాడు. కనిపించడు కానీ అతని హృదయ స్పందన మనకు వినిపిస్తుంది.

ఆ పిల్లాడి నానమ్మ ఇందులో ప్రధాన పాత్రధారి. ప్రాణమున్న పాత్ర.

పిల్లాడి తండ్రి బతుకుతెరువు కోసం గ్రామం వదిలి ఒక చిన్న పాటి టౌనుకొచ్చి ఇల్లు కట్టుకుని కాపురం ఉంటాడు. ఆ ఇంటికి మూడు గదులు. మొదటి గదిని షెట్టర్ వేయించాలని బహుశా వీలుకాక అలా వొదిలేస్తాడు. రెండో గదికి పరదా ఉంటుంది. ఆ పరదానే ఇప్పుడు ఈ కథకి ఆధారం. ఆ పరదా అయినా ఆ పిల్లాడి అక్క పెద్దమనిషి అయిన తర్వాతే వచ్చిందంటాడు రచయిత. మూడోది వంటగది.

గ్రామ సీమల్లో పరదాలు ఉండవు. ఉన్నా వాటికి పెద్ద ప్రాధాన్యత ఉండదు. అన్ని మతాల వాళ్లు కలసి మెలసి తిరుగుతారు కాబట్టి వాటి అవసరంరాదు. అక్కడ పేదరికం అందర్నీ అనివార్యంగానైనా ఒకటి చేస్తుంది.

జేజి గ్రామ పునాదుల్నించి వచ్చింది. స్వేచ్ఛగా తిరగడం, కాయకష్టం చెయ్యడం తెలిసిన మనిషి. ఒంట్లో శక్తి ఉన్నంతవరకూ కొడుకు మీద ఆధారపడకుండా పల్లె పట్టున గుడిసెలో ఉంటూ జీవనం సాగించింది. శక్తి ఉడిగిపోయాక కొడుకును వెతుక్కుంటూ టౌనుకొచ్చింది. కానీ ఇంటి పట్టున ఉండలేదు. కోడలు గొడవ పడినా సమయానికి ఇంత తిండి కావాలి కాబట్టి సర్దుకుపోతుంది.

కానీ ఆమెకు లోలోపల మాత్రం గత జీవితమంటేనే మమకారం. ఆ పల్లె పట్టున ఉండే స్వేచ్ఛ అంటేనే ఆమెకు ఇష్టం. ఆ స్వేచ్ఛ ఎందుకో కొడుకు ఇంట్లో లేనట్టు ఆవిడ ఫీలవుతుంది.

"పేరుకు కొడుకున్నాడు కానీ తన కష్టం సుఖం పట్టించుకోడు. వీడి దగ్గరికొచ్చి తనింట్లో తాను దొంగ తిండి తినాల్సి వస్తోంది. వీడికన్నా పరాయి వాళ్లు మేలు. వెళ్లి కూచుంటే పెట్టే ఒక పూటైనా నోటికి మనస్ఫూర్తిగా ముద్ద అందిస్తారు..."అంటూ

బాధ పడుతుంది.

పెళ్లికావాల్సిన ఆడపిల్ల ఇంట్లో ఉంది కాబట్టి లోపలికి వెళ్లేటప్పుడు బయటికి వచ్చే టప్పుడు గుమ్మానికున్న పర్దాను సరిగా వేయమని అందరూ చెబుతున్నా ఆమె మర్చిపోతూ వాళ్లతో తిట్లు తింటూఉంటుంది.

ఆ పర్దాను కూడా కళ్లకు కట్టినట్టు వివరిస్తాడు రచయిత.

"అది పూల పూల పర్దా. దాని మధ్యలో మక్కా బొమ్మ ఉంది. గుమ్మానికి నిండుగా కప్పి ఉంది" అంటాడు.

ఒకసారి జేజి ఈ ఇంటి వాతావరణాన్ని తన పల్లెలోని గుడిసె వాతావరణాన్ని ఆలోచనల్లోనే పోల్చుకుంటుంది.

"తన రెండంకణాల గుడిసెలో తానే మహారాణి. ఇంట్లోకి, బయటికి ఎన్ని సార్లయినా తిరగొచ్చు. తన మాటకు ఎవరూ ఎదురు చెప్పరు. తనని ఎవరూ అడ్డుకోరు. ఇక్కడే ఈ పరదాలు.. అంతరాలు. ఒట్టి దాపరికపు మనుషులు. అసలు తమకు గోషా అనే మాటే తెలియదు. ముట్టయిన నాలుగు రోజులు ఆడపిల్లను ఓ మూల కూర్చోబెట్టి ఐదోరోజు చింత బర్ర చేతిఇచ్చి గొడ్ల కాడికి పంపేస్తారు కాపలాకు" అని గొనుక్కుంటుంది.

జేజి కళ్లకు కనిపించే పరదా గురించి మనకు రచయిత చెబుతూనే ఆమె స్వేచ్ఛ గురించి వివరిస్తాడు. అదే సమయంలో ఒకరిపై ఆధారపడటంలో ఉన్న ఆవేదనని మన మనసుకందిస్తాడు.

ఇక్కడ ఒక్క విషయం చెప్పాలి.

గ్రామ సీమ నుంచి వచ్చి పత్రికల్లో జర్నలిస్టులుగా చేరి రచయితలైన వాళ్లు తమ చిన్న నాటి జ్ఞాపకాల్ని మాండలిక రచనలుగా మార్చి కొంతకాలం పాఠకుల్ని ఆకట్టుకున్నారు. కానీ వాటి ఉనికి తాత్కాలికమని వాళ్లెప్పుడూ గుర్తించినట్టు కనబడదు. పరిణామంలో భాష కూడా సౌలభ్యాన్ని సంతరించుకుంటుంది. అప్పటిదాక ఎప్పుడూ చదివి ఉండని స్థానిక మాండలికం ఒక్కసారిగా రంగంలోకి రావడంతో వింతగా అనిపించి కొంతమంది వాటికి ఆహ్వానం పలికిన మాట వాస్తవం. వాళ్లని అభినందించిన మాట కూడా వాస్తవమే. కానీ మాండలికం అన్నది అన్నివేళలా సౌలభ్యానికి వీలు కల్పించదు. అన్ని ప్రాంతాలకు ఆమోదయోగ్యమైన భాషే అందరూ ఇష్టపడతారు. విద్యావంతులు దాన్నే కోరుకుంటారు. అందువల్ల మాండలికంలో మెరుపులు మెరిపించిన రచయితలు తర్వాత ప్రామాణిక వ్యవహార భాషల్లో రచనలు చెయ్యక తప్పదు. అలా చేసిన వాళ్లు నిలదొక్కుకున్నారు. చెయ్యలేనివాళ్లు రంగం

నుంచి నిష్క్రమించారు.

ఇదంతా చెప్పడమెందుకంటే షరీఫ్ భాష సరళమైంది. సజీవమైంది. పాత్రలు కొన్ని సందర్భాల్లో మాండలిక పదాలు వాడినా అవి అందరికీ ఆమోదయోగ్యంగానే ఉంటాయి. అతని భాష అనాయాసంగా సూటిగా, సరాసరిగా, మన హృదయాల్ని తాకుతూ ఉంటుంది.

ఇక్కడ జేజి తన గతాన్ని నెమరువేసుకుంటుంది. భర్తకి ఆమె రెండోభార్య. కొడుకు పుట్టిన కొంత కాలానికే భర్త చనిపోతే కొడుకుని పెంచడానికి ఆమె పడిన కష్టాలను తలుచుకుంటుంది. కానీ కొడుకు పరదా వేసి కూతుర్ని ఎందుకు గోషా పెట్టాడో అర్థం కాక ఒకసారి అడుగుతుంది. దానికి కొడుకు..

''యాన్నించి తెస్తావ్ లచ్చులు? లచ్చల్తో పని. గోషా లేకండా తిప్పితే మనతో అయితాదా? అసలు తట్టుకుంటామా? పిల్లదానికి పెండ్లి చెయ్యడమంటే మాట లనుకుంటాండావా? ఇంట్లో కూచోపెట్టి నాలుగు ఉర్దూ ముక్కలు చెప్పిస్తే ఎవరో ఒకరు జేసకపోతారు. లెక్క దండిగా ఇయ్యకుంటే పాయ. పిల్లదాన్ని పరువుగానైనా పెంచిండారు కదా.. అనుకుంటారు..'' అంటాడు.

డబ్బిచ్చి పిల్లకి పెళ్లి చేసే స్తోమత లేక తండ్రి ఇక్కడ గోషా పెట్టాడు. అంటే ఆర్థిక వ్యవహారాలు కూడా అప్పుడప్పుడు మత సంప్రదాయాల్ని ప్రభావితం చేస్తాయని చెప్పడమన్నమాట.

కొడుకు మాటల్ని ఆమె అర్థం చేసుకుంది. కానీ అస్తమానం కూతురే కాదు కదా.. కొంచెం తల్లిని కూడా పట్టించుకోవాలి కదా.. అదే ఆమె బాధ.

జేజికి అప్పుడప్పుడు గుండెల్లో కొంచెం నొప్పి వస్తూ ఉన్నా కొడుకు పట్టించుకోడు. చివరికి ఆమె ధర్మాసుపత్రికి బయల్దేరుతుంది. పల్లె మనిషి అయిన ఆమెకు వొంటి మీద నిండా దుప్పటి కప్పుకోవాలన్న స్పృహ అంతగా ఉండదు. పైగా 'ముసలిదాన్ని అయిపోయాను..కదా..'అని కొంచెం నిర్లక్ష్యం. దుప్పటి లేకుండా ధర్మాసుపత్రికి వెళ్తూ దారిలో కలిసిన ఓ వ్యక్తితో కొడుకు తనని పట్టించుకోవడం లేదని చెబుతుంది.

అతను కొడుకు పట్టించుకోవడం లేదన్న విషయాన్ని పక్కన పెట్టి ఆమె దుప్పటి లేకుండా ఆస్పత్రి వెళ్తోందన్న విషయాన్ని హైలెట్ చేసి కొడుక్కి ఫిర్యాదు చేస్తాడు. 'ఫలాన వాళ్ల తల్లి దుప్పటి లేకుండా బయటికి వెళ్తోందేంటి?' అని నలుగురూ అనుకుని, బొత్తిగా సంప్రదాయాలు తెలియవని పిల్లను పెళ్లాడటానికి ఎవరూ ముందుకురాకుంటే ఏంటి పరిస్థితి.

అందుకే తల్లి అని కూడా చూడకుండా ఆస్పత్రి నుంచి రాగానే "దుప్పటి కప్పుకుని చావొచ్చు కదా.." అని ఆమెమీద భగ్గుమంటాడు కొడుకు. ఒకదశలో కొట్టడానికి కూడా వెళ్తాడు.

జేజి మనసు విరిగిపోతుంది. అడుక్కోని తినైనా బతకొచ్చు కానీ స్వేచ్ఛ లేకుండా బతకలేనని ఇంట్లో నుంచి వెళ్లిపోవడానికి సిద్ధమవుతుంది. కథ అంతటితో ముగుస్తుంది.

అంతవరకూ కథలో పాత్రై ఇదంతా మనకు చెబుతున్న పిల్లాడు చివర్లో ఒక వాక్యం చెబుతాడు. 'నేను గుమ్మానికున్న పరదాను సర్ది పట్టుకుని నీళ్లు నిండిన కళ్లతో జేజివైపే చూస్తుండిపోయాను నిస్సహాయంగా..' అంటూ.

ఈకథ ఎన్నో ప్రశ్నల్ని మనమీద వదిలి వెళ్తుంది. గ్రామాల నుంచి పట్టణాలకు, పట్టణాల నుంచీ నగరాలకు కోట్లాది మంది తరలే క్రమంలో వాళ్లు ఎన్నెన్ని కోల్పోతారో ఈ కథ చెబుతుంది.

ఈ కథ మేరకు జేజ గ్రామం నుంచి వచ్చి పట్టణంలో కొంతకాలం ఉండి మళ్లీ అదే గ్రామానికి వెళ్లిపోయింది. ఈ వెళ్లే క్రమంలో మమకారం తెగిపోయింది. అనుబంధం.. ఆవిరైపోయింది. ఆమె నిస్సహాయంగా మిగిలి వెళ్లిపోయింది. ఏమీ చెయ్యలేని మనవడు కూడా నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయాడు. ఎదుగుదల లేని జీవితంతో కూతురు భవిష్యత్తును ఊహల్లో నిలుపుకున్న కొడుకు ఆగ్రహంలోనూ నిస్సహాయత ఉంది.

కథలోని పసివాడు వీటిని పరిశీలిస్తాడు. వీటన్నిటికీ దారిద్ర్యమే కారణమని తేలుస్తాడు. రేపు ఆ పసివాడు కూడా పెద్దవాడై నగరం బాట పట్టొచ్చు. అప్పుడు గ్రామానికి, పట్టణానికి, నగరానికి మధ్య ఎక్కడో అనుసంధానం ఆగిపోతుంది. తరాల మధ్య అంతరాల స్పృహని కూడా ఈ కథ కలిగిస్తుంది.

స్వేచ్ఛ. ఆనందం అన్నవి సంపదతో సంబంధం లేని విషయాలని కూడా రచయిత మనకు చెప్పకనే చెబుతాడు. మతమన్నదాన్ని కూడా మన పేదతానికి అనుకూలంగా మలచుకోవడం ఇందులో కనిపిస్తుంది.

అవసరమన్నది మానవ సంబంధాలపై ఎంత కఠినంగా అధికారం చెలాయిస్తుందో ఈ కథ చెబుతుంది. స్వేచ్ఛ అన్నది అవసరాల్ని కూడా కాదనేంత గొప్పదని, అది గొప్ప తెగింపుకు అవకాశమిస్తుందని ఒక చిత్రమైన విషయాన్ని చర్చకు పెడుతుంది.

✡

# పరిధులు విస్తరించిన ప్రతిభ

విలక్షణమైన షరీఫ్ దృష్టి విశాలమైంది. జీవితం - మనుషుల్ని ఎన్ని విచిత్రమైన మలుపులు తిప్పుతుందో అతనికి తెలుసు. అందుకనే ఎవరి పట్లా అతనికి అయిష్టముండదు. తనకు ఆమోదం కాని అభిప్రాయాల్ని కూడా అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. అంతేకాదు తాను ఏర్పరచుకున్న అభిప్రాయాలు సరైనవి కాకుంటే వాటిని వదులుకోవడానికి సందేహించడు.

జీవితాన్ని మరింత సంపన్నం చేసే ఎలాంటి పరిణామానికైనా సిద్ధంగా ఉంటాడు. నిరంతరం నిశిత పరిశీలనతో ఉంటాడు. నిర్మలంగా ఉంటాడు. నిత్య చైతన్యంతో ఉంటాడు.

'చాపరాయి' అని షరీఫ్ ఓ కథ రాశాడు. ఆ కథ చదివితే మనకు షరీఫ్ పట్ల అపారమైన గౌరవమేర్పడుతుంది. చిన్ని చిన్ని అనుభవాల నుంచి కూడా అతను నేర్చుకుంటాడు. వాళ్లు గొప్పవాళ్లా.. తక్కువ వాళ్లా.. అనేది అతనికి పట్టదు. అవతల ఉన్నది ఎవరైనా సరే.. తెలుసుకోవాల్సింది ఏదైనా ఉందని తెలిస్తే మాత్రం తెలుసుకోకుండా ఊరుకోడు.

చాలా పెద్ద సంఘటనే మనిషిలో మార్పు తెస్తుందనేది అబద్ధం. చిన్ని చిన్ని

ఘటనలు సైతం మనల్ని పరివర్తుల్ని చేస్తాయి. పెద్దగా ఆలోచింపజేసి మార్పును తెస్తాయి. ఇక చర్మం మందమైన వాళ్లని ఎలాంటి సంఘటనలు చలింప జేయలేవు. అది వేరే సంగతి.

మనిషి ప్రాథమికంగా తెలుసుకోవడానికి సిద్ధపడి ఉండాలి. అప్పుడే సంఘటన చిన్నదైనా, పెద్దదైనా అది అతనిలో తెచ్చే మార్పులో పెద్ద తేడా ఉండదు.

ఒక జర్నలిస్టు- భార్య, ఏడునెలల కొడుకుతో నగర జీవితం నుంచి కాస్త విశ్రాంతి పొందుదామని అరకులోయలో ఉన్న 'చాపరాయి' ప్రాంతానికి వెళ్తాడు. ఏడు నెలల కొడుకుని బేబీ క్యారియర్‌లో వేసుకుని దాన్ని మెడకు తగిలించుకుటాడు. అతను ప్రకృతి ప్రేమికుడు. సహజసిద్ధంగా అందంగా ఉన్న ఆ ప్రాంతాన్ని చూసి పరవశిస్తాడు.

చాపలాగా పరచుకున్న రాళ్ల వల్ల ఆ ప్రాంతానికి 'చాపరాయి' అని పేరు వచ్చి ఉండొచ్చని అనుకుంటాడు. అంతలో అక్కడ రాళ్లమీద ఎక్కడపడితే అక్కడ ప్రేమికుల పేర్లు కనబడతాయి. వాటిని చూసి చిరాకు పడతాడు. ప్రేమ పేరుతో ప్రకృతిని మలినం చెయ్యడం అతనికి బాధకలిగిస్తుంది. నగరంలో అయితే బస్సుల్లో, బాత్రూముల్లో, బిల్డింగుల్లో ప్రేమికుల పిచ్చి రాతలు మామూలే. కానీ ప్రకృతి రమణీయ ప్రాంతంలో కూడా అలాంటి పిచ్చి రాతలు ప్రత్యక్షం కావడం అతనికి ఆందోళన కలిగిస్తుంది. రేడియోలో జాకీగా పని చేసినప్పుడు ఈ విషయంపై జరిగిన చర్చ అతనికి గుర్తుకు వస్తుంది.

అన్నిటికన్నా షాకింగ్ ఏంటంటే అక్కడ ఒక బోర్డు ఉండడం. ఆ బోర్డుపై ''రాళ్ల మీద పేర్లు రాయబడును. పేరు ఒక్కింటికి 60 రూపాయలు..'' అని రాసి ఉండడం. దగ్గర్లో ఒక వ్యక్తి రెండు రంగుడబ్బాలు పెట్టుకుని కూచుని ఉంటే అతని దగ్గరికి వెళ్తాడు.

''ప్రకృతి సిద్ధంగా పుట్టిన అందమైన రాళ్లనిఇలా పేర్ల పేరుతో పాడు చేయడం తప్పు కదా..''అని అడుగుతాడు జర్నలిస్టు.

ఇక్కడి దాక సజావుగా జరిగిన కథ రాళ్ల మీద పేర్లు రాసే వ్యక్తి చెప్పిన మాటల్తో ఒక్క సారిగా మలుపుతిరుగుతుంది.

రాళ్ల మీద పేర్లు రాసే వ్యక్తి పేరు రామారావు. రామారావు ''సార్! పొట్ట కూటికోసం రాళ్ల మీద పేర్లు రాస్తుంటేనే మీరు నన్నింతగా అంటున్నారు. మరి మీరు చేస్తున్నదేంటి సార్. హాయిగా ఆడుతూ పాడుతూ తిరగాల్సిన పిల్లాడ్ని ఇలా

చెట్టుకు ఉరేసినట్టు వేలాడేసుకుని తిరగడం తప్పు కదా సార్!'' అంటాడు.

ఆ మాట ఊహించనిది. దాంతో జర్నలిస్టు షాక్ తింటాడు. కేరీ బ్యాగ్‌లోంచి పసివాణ్ని కిందికి దించుతాడు. అంతవరకు గాల్లో వేలాడేసినట్టుగా ఉండే పిల్లవాడు చలాకీగా ఆడుకుంటాడు. అతనిలో ఉత్సాహం చూసి ఆశ్చర్యపోతాడు జర్నలిస్టు.

చివరికి ఆలోచనలో పడి ''రామారావ్! నా తప్పు తెలుసుకున్నాను. అందుకే బాబును బేబీ క్యారియర్‌లోంచి కిందికి దింపాను. మరీ నీ తప్పు కూడా నువ్వు సరిదిద్దుకుని రాళ్లపై రాయడం మానేస్తావా?''అని అడుగుతాడు.

అప్పుడు రామారావు నిస్సందేహంగా ''మానను..'' అంటాడు.

అంతేకాదు ''నేను రాయనంత మాత్రాన ప్రేమికులు ఈ రాళ్లపై రాయకుండా ఉండరు. పెయింట్‌తో రాసింది కిరోసిన్‌తో తుడిస్తే పోతుంది. అదే ప్రేమికులు రాళ్లపై చెక్కితే ఆ రాతలు ఎప్పటికీ పోవు..'' అంటాడు.

అప్పటి క్కూడా ఆగడు.

''కానీ మీరు చేస్తోంది పాపం సార్. పిల్లల్ని హింసిస్తే ఆ పాపం తరతరాలకు పోదు. ఆ పసివాణ్ని స్వేచ్ఛగా తిరగనివ్వండి..'' అంటూ సలహా ఇస్తాడు.

అప్పుడు శ్రీకృష్ణుడి ముందు గర్వభంగమైన అర్జునుడిలా తయారవుతుంది జర్నలిస్టు పరిస్థితి.

ఈ కథ మనలో ఎన్నో ప్రశ్నల్ని రేకిత్తిస్తుంది. అర్జునుడిలాగా జర్నలిస్టుకు జ్ఞానోదయం అయ్యింది. కానీ సమాధానం దొరకని ప్రశ్నలు సవాలక్ష మిగిలిపోయాయి. రామారావుకు తాను చేస్తున్న పని తప్పు అన్న భావన ఏ కోశాన లేదు. పైగా తాను రాళ్లను ఏ రకంగా ప్రేమికుల నుంచి రక్షిస్తున్నాడో కూడా చెప్పాడు. జర్నలిస్టు తన పసివాణ్ని ఎలా స్వేచ్ఛగా ఆడుకోనివ్వాలో తెలుసుకున్నాడు.

ప్రకృతిని ఎవడి ఇష్టం వచ్చినట్టు వాడు వాడుకుంటున్నాడు. ప్రకృతి నోరు లేనిది కదా..! ప్రేమికులు ఇలా పబ్లిక్ గోడలపై పేర్లు రాసే వ్యసనానికి గురవడం వెనుక ఎన్నో సామాజిక, మానసిక కారణాలున్నాయి. లైంగిక అణచివేతకు గురైన వాళ్లే, ప్రేమకు నోచుకోని వాళ్లే ఇలాంటి పనులు చేస్తుంటారన్నది ఒక పరిశీలన.

కథ గొప్పతనమెక్కడంటే ''రాళ్ల మీద పేర్లు రాయబడును..''అన్న ఒక బోర్డును జర్నలిస్టు చూడటం వల్ల ప్రేమను నోచుకోని వ్యక్తుల వైపరీత్యాలు, స్వేచ్ఛకు నోచుకోని పిల్లల పెంపకాలు, బతుకు తెరువు కోసం పేరురాసే పేదవాళ్ల జీవితాలు, ఎవరేమీ చేసినా నోరు మెదపని ప్రకృతి, మారడానికి ఎప్పుడూ సిద్ధమైన

మానవత్వమున్న జర్నలిస్టు లాంటి వ్యక్తుల చూపులు ఇవన్నీ- శ్రీశ్రీ అన్నట్టుగా "మన వైపే చూస్తుంటాయి.. మన లోతు కనుక్కోమంటాయ్"

మనిషన్నవాడు ప్రవాహంలా ఉండాలి. పరిణామానికి సిద్ధపడి ఉండాలి. అప్పుడు తెలుసుకోవడానికే కాదు, అక్కర్లేంది వదిలించుకోవడానికైనా అప్రమత్తంగా ఉంటాడు మనిషి.

అలా షరీఫ్ రచన సులభ సుందరంగా ఉంటూనే గంభీరంగా ఉంటుంది. మనల్ని శుభ్రపరుస్తుంది. మనల్ని స్వచ్ఛంగా మారుస్తుంది.

ఆధునిక కథారచనలో ముప్పయ్యేళ్లు దాటని యువరచయితలు వేళ్లమీద లెక్కించగలిగిన వాళ్లే ఉన్నారు. తన ప్రాణవంతమైన పరిశీలనతో కథారచనకు జీవం పోస్తున్న 'చివరి' తరంలో చిరంజీవి షరీఫ్.

✡